# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 రాజమహేంద్రవరము 1-2-1981 సంచిక 7

—* ఈ సంచికలో *—



16—2. 81 సంచికలో పెద్దనార్యుని ఆంధ్రకవితా పితామహత్వము, చేమకూర కవితా చమత్కృతి, సంధ్య నవల - ఒక పరిశీలన, ఆంధ్ర కవులు - అభ్యవహారపద్ధతులు, దాశరథి తిమిరంలో సమరం మొ॥ ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా :
సంవత్సరమునకు రు. 12—00.
అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడి ప్రతి 60 పై.



# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.





సంపుటము 4 రాజమహేంద్రవరము 1-2-1981 సంచిక 7


## మౌసలపర్వ వైశిష్ట్యము

— శ్రీ డా. చన్నాప్రగడ తిరుపతిరావు, ఎం.ఏ., పిహెచ్.డి.

శ్రీమన్మహాభారతము అష్టాదశ పర్వసమన్వితము. అందు మౌసలపర్వము పదునారవది. పర్వములు పదునెనిమిదింట మౌసలపర్వము విశిష్టమైనది. ఆ విశిష్టత పలువిధములైనది.

మొదటిది నిర్మాణసంబంధి యైనది. భారతము అష్టాదశపర్వసమన్విత మన్నట్లే శతపర్వసమన్విత మనియు కలదు. పౌష్యంబు, పౌలోమంబు, ఆస్తీకంబు మొదలుగాగల నూరుపర్వములు మరల ఆది, సభా, ఆరణ్యాద్యష్టాదశపర్వములుగా సంగృహీతములైనవి. అనగా ఆదిపర్వమున 18, సభాపర్వమున 9, ఆరణ్యపర్వమున 16 – ఇట్లు ఒక్కొక్క పర్వమునను అంతర్భాగములుగా కొన్ని పర్వము లున్నవి. స్పష్టతకొరకై ఆదిపర్వాదులను పర్వములనియు, పౌష్యాదులను ఉపపర్వములనియు చెప్పుట కలదు. ఇటు పర్వము లన్నియు అనేకోప పర్వసముదాయములై యుండగా మౌసలపర్వము మాత్రము అంతర్భాగములు లేక ఒకే ఉపపర్వముతో కూడియున్నది. మహాప్రస్థాన స్వర్గారోహణ పర్వములు కూడ ఏకఉపపర్వయుతములే. ఇతివృత్తపరముగ ఈ పర్వములకు గల ప్రాధాన్యమును ఈ నిర్మాణవైశిష్ట్యము సూచించుచున్నది.

రెండవది ఇతివృత్త సంబంధియైనది. భారతము పాండవుల చరిత్రగా ప్రసిద్ధమైనను, అది కేవలము పాండవుల చరిత్రమాత్రమే కాదు. 'ఆ నారాయణ మాహాత్మ్య'మే శ్రీమహాభారతాఖ్యాన మనియు, అది 'కృష్ణార్జునోత్తమ నానా గుణ కీర్తనాఫలము'అనియు నన్నయ పలికెను నిజమునకు భారతమున నాయకుడు శ్రీకృష్ణుడేయని పండితులు చెప్పుదురు. అయినను మహాభారతమునందలి 17 పర్వములు ప్రధానముగా పాండవులచరిత్రకు సంబంధించినవే; వారి కష్టనష్టములను నిరూపించునవే. ఆయా సందర్భములలో శ్రీకృష్ణుడు కూడ రంగస్థలముపై కనిపించినను, సూత్రధారు డాతడే యైనను, ప్రధాన కథ అతనికి సంబంధించినది కాదు. కథయందలి కష్టసుఖములు అతనికి సంబంధించినవి కావు. కాగా మౌసలపర్వ కథమాత్రము ప్రధానముగా కృష్ణునకు సంబంధించినదే. అర్జునుడును ఇతరపాండవులును కథాభిత్తిపై కానవచ్చినను నిజమునకు ఈ పర్వచరిత్ర వారిది కాదు. ఈవిధముగ మౌసలపర్వము తక్కిన పర్వములకంటె విశిష్టమైనది.

కథ ప్రధానముగా కృష్ణునకును యాదవులకును సంబంధించినదే యైనను దాని ప్రభావము పాండవుల చరిత్రపై పడకపోలేదు. శత్రుసంహార మొనర్చి సామ్రాజ్యపట్టభద్రులైన పాండవులు జీవితమునెడ విరక్తులై మహాప్రస్థానము చేయుటకు కారణము మౌసలపర్వ మందలి శ్రీకృష్ణనిర్యాణమే. పాండవుల జీవితమందలి ఈ తుది మలుపునకు మౌసలపర్వపు ఇతివృత్తమే కారణము.

మూడవది రససంబంధి యైనది. భారతము శాంతరసప్రధాన మని పండితు లందురు. కాని మౌసలపర్వమును విడిగా గ్రహించినచో అది యొక కరుణరసప్రధాన మగు ప్రబంధముగా గోచరించును. జగదేకవీరులగు కొడుకులును, మనుమలును, మునిమనుమలును ఇతర బంధువులును నిర్ణిమిత్తమైన జ్ఞాతికలహమున ఒక్కసారిగా నశింపగా వసుదేవుడు కొమ్మలు, రెమ్మలు, ఆకులు, చివుళ్ళు, పూవులు, పండ్లు, మొగ్గలు, పిందెలు సమస్తము కోలుపోయి మోడైనిలిచిన మహావృక్షమును పోలియున్నాడు. శ్రీకృష్ణమహిషుల యొక్కయు, అంతకంటెను

కృష్ణగతప్రాణులైన పాండవుల యొక్కయు దుఃఖముకూడ తీవ్రమైనదే. కాని వసుదేవుని దుఃఖము పరమావధి భూతమైనది.

కరుణము అంగిరసము కాగా, భారత మందలి ప్రధానరసమైన శాంతము మౌసల పర్వమున అంగరసమైనది. పర్వాంతమున వేదవ్యాసోపదేశమువలన అర్జునునకు నిర్వేదము కలిగినది. ఇచట శాంతరస స్ఫూర్తి కలదు. అట్లే యాదవవీరుల పరస్పర హననకాండలో రౌద్రము, అర్జునుడు బోయల నెదుర్కొనుటలో వీరము అంగరసములుగా కనిపించుచున్నవి.

నాల్గవది తాత్త్వికమైన విశిష్టత. దైవము, విధి, కాలము మున్నగు పేర్లతో చెప్పబడెడు మానవాతీతశక్తియొక్క ప్రభావము మౌసలపర్వమున నిరూపితమైనట్లు మరెచ్చటను కాలేదు. ఈ విషయము మరికొంత విపులముగా వివరింపదగినది.

ఇక తిక్కన రచించిన తెలుగు భారతములో మౌసలపర్వమున మరికొన్ని విశిష్టతలు గమనింపదగియున్నవి.

కవిత్రయమువారు సంస్కృత భారతమునకు సంగ్రహరూపమైన అనువాదమును చేసియున్నారు. తెలుగు భారతము సంస్కృత భారతములో సుమారు మూడవవంతు పరిమాణము గలది. కాగా మౌసలపర్వము మాత్రము తెలుగులో మూలముకంటె విస్తృతమైనది. సంస్కృతమున 280 అనుష్టుప్పులు మాత్ర ముండగా తెలుగున 220 పద్యము లున్నవి. సగటున ఒక తెలుగు పద్యము రెండు అనుష్టుప్పులకు సమముగా లెక్కింపదగియున్నది. తెలుగు మౌసలపర్వము సంస్కృతమునకు దాదాపు రెట్టింపున్నది. ఆయా రసపుష్టులను తిక్కన రసపరవశుడై విస్తరించుటయే దీనికి కారణము.

మరియొక విశిష్టత రచనాసంబంధియైనది. ఆంధ్రమహాభారతము చంపువుగా రచింపబడిన దనుట ప్రసిద్ధము. మౌసల పర్వమును మాత్రము తిక్కన తనఉత్తర రామాయణమువలె నిర్వచనముగా రచించియున్నాడు. కొన్ని ముద్రిత ప్రతులలో 34 వ సంఖ్యతో 'అంత బలుండును బోవ నిశ్చయించి చెప్పిన' అను నొక చిన్న గద్యశకలము కనిపించుచున్నది. కాని అది పూర్వాపరపద్యములమధ్య సందర్భశూన్యముగానుండి అతుకవున్నది. కనుక ఇది తిక్కన రచితము కాదు. ప్రమాదాపతితమైన ప్రక్షిప్తము.

ఇట్లు పరిమాణమున విస్తృతియు, స్వరూపమున నిర్వచనత్వమును పాటించుటచే ఈ పర్వవైశిష్ట్యమును తిక్కన వ్యంగ్యముగ ప్రకటించినవాడయ్యెను.

ఇట్టి విశిష్టతలు గల దగుటచే మౌసల పర్వము బహుదృక్కోణములనుండి విపులముగా పరిశీలింపదగియున్నది.

—+—

# పునరావృత్తమౌతున్న విమర్శ పద్ధతులు

– శ్రీ చింతలపూడి వేంకటేశ్వరులు, ఎం. ఏ.

విమర్శ అనేది నిష్పక్షపాతంగా సాగాలనీ, పూర్వవిమర్శకులు ఏదో ఒక కోమ్ము కాసేవారనీ ఒకవైపు విమర్శ సాగుతుండగా, మరొకవైపు నేటివిమర్శకులు మాత్రం ఇంకా వెనక్కి పోతున్నారు. పూర్వం కావ్యాల్లో మాత్రమే కవినిందలు కనిపించగా నేడు విమర్శక వ్యాసాల్లో సహితం అలాంటివి కనిపిస్తున్నాయి. తనకు నచ్చినవాణ్ణి పొగడటం, కాదన్నవాళ్ళని శాపనార్థాలు పెట్టడం ఈ విమర్శకుల లక్షణం అయిపోయింది.

సమాలోచన (4 5) లో డా. జి. బి. యస్. ఆచార్యగారు 'దాశరథిగారి పునర్నవం' ను గురించి వ్రాస్తూ 'దాశరథి కానుకను పరిగ్రహించాలన్నా, ఆయన చెపుతున్న పునర్నవాన్ని అర్థం చేసుకోవాలన్నా,మన మనఃకుటిలో కృత్రిమాల చీకటి పోవాలి, మన నరాల్లో జవం రావాలి' అంటూరు. మన నరాల్లో జవం రావటంకోసమే కదా ఈ ఆధునికకవులు తమ కవిత్వం వ్రాస్తున్నది. మరి వారి కవిత్వం అర్థం చేసుకోవడానికే మన నరాల్లో జవం కావలసివస్తే ఇంక వారి కవిత్వంవలన ప్రయోజనం? పైగా పై వాక్యంలో విమర్శకులవారి భావం దాశరథి కవిత్వానికి పేరుపెట్టేవారంతా బలహీనులు, అంధమనస్కు లనేకదా! తాము పొగడినవాడిని పొగడి, తమపొగడ్తలకు బ్రహ్మరథం పడితే వారి నరాల్లో జవం ఉన్నట్లు, లేకుంటే వారి మనసులలో కృత్రిమాలచీకట్లు ఉన్నట్లు ప్రకటించడం ఎంతవరకు భావ్యం?

ఇక కవిగారి గొప్పతనాన్ని, విమర్శకులవారి ప్రతిపాదనల గొప్పదనాన్ని అలా పైపైని చూద్దాం.

అది అసలే ఎత్తైన ఆశాశైలం. కవిగారు దాని కొట్టకొసను నిలబడి పద్యాల పావురాళ్ళని విసిరివేశారు. మరి అవి న్యాయంగా పైకి ఎగిరిపోవాలి. అదే జరిగితే కవిగారి ప్రబోధాలు కొండ దిగువను ఉన్న సామాన్యుడికే అందవుకదా... ఇంకా అట్టడుగున మ్రగ్గే నిరుపేద కందేనా, వాడది అనుభవించేనా? ఆశాశైలంమీదనిలబడ్డ కవిగారిదృష్టిలో చివరకా నిరుపేద మాగ్నాకార్టామీద సంతకముకూడా చేశాడు. ఇదంతా పరిశీలిస్తే విమర్శకులవారు సెలవిచ్చిన ముప్పేట

లోని భావనాబలం, శిల్పం ఎంత మేరకు ఇందులో ఉన్నాయో పాఠకులే గమనింతురు గాక !

ఆశాశైలం మీది కవిగారికి ఇంకా చాలా కనిపించాయి. అడుగడుగునా ఉదయాలూ, అంగుళం అంగుళాన హృదయాలూ, పతితప్రజావిజయాలూ, అంతకు ముందు మరొక కేకల కవి ప్రబోధం విని సగం దగాపడటం మానుకున్న తమ్ముళ్ళూ, మొగం తుడుచుకొని మేలుకొన్న పేదజనం... ఎన్ని కనిపించవు ఇలాటివి. నుంచున్నది ఆశాశైలంమీద కదా! పేదవారి బ్రతుకులు రాజకీయవాదుల పదవులకు, ఆధునిక కవుల కీర్తికిరీటాలకు ఇంధనా లయిపోతాయి నిజానికి.

'తమ మంత్రం పార దింక
ఉచ్చు త్రెంచుకొనెను జింక;
ఇక స్వేచ్ఛా ప్రయాణము
ఇదే తెలంగాణము'

అన్నచోట రచన ఎప్పటిదైనా కలతలు సద్దుమణిగి బుద్ధిగా ఉన్న సమగ్రాంధ్ర రాష్ట్రంలో ఇప్పుడేమి ఆశించి కవిగారు ప్రకటించినట్లు, ఏమి ఆశించి విమర్శకుల వారు ఉటంకించినట్లు ?

జగన్నాథుని రథచక్రాల కోసం చూచి చూచి కళ్ళు కాయలుకాచాయి జనానికి. ఇప్పుడీ దాశరథిగారి 'రేపు' (రేపుమాత్రం జనం చూచే... రేపు రేపే) ఏ గోడమీద వ్రాసుకోవడానికి ? పదం పదంలో ఏదో స్వేచ్ఛాస్వాతంత్ర్యాలున్నాయని చూపించడం కాకి వంటి మీద ఈక ఈకలో నలుపు ఉందని నిరూపించడమే. ఆస్థానకవి కాకముందే దాశరథి అంటే అభ్యుదయవాది, స్వాతంత్ర్య కాముకుడు అనే విషయం అందరికీ తెలుసు. ఇంకా వారి ప్రతి రచనను శల్యపరీక్ష చేసి అక్కడ స్వాతంత్ర్య భావం ఉంది, ఇక్కడ అభ్యుదయ పోకడ ఉంది అని చూపించడం చర్విత చర్వణమే.

ఆచార్యగారు ఉటంకించినవాటిలోనే మరొకచోట కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారి దివ్యస్మృతిలో కవిగారు కార్చిన కన్నీటి కెరటంలో 'అతడులేని తెలంగాణ - అలంకరణ లేని జాణ' అనే అపశ్రుతి వినిపిస్తోంది. జాణకు జాణతనమే నిజమైన అలంకరణ. వేరే అలంకరణలు లేకపోయినా ఆమె జాణయే. ఈ ఉపమానంలో ఆయన లేనందున లోటు ఏమీ లేదనే ధ్వనిస్తోంది. అందులో ఏమి అందాలు చూచారో విమర్శకులవారు.

ఇలా విమర్శించుకుంటూ పోతే దాశరథిగారి కవితలో నేకాదు. ప్రతి (సా) మాన్య కవి రచనలోనూ ఒప్పులతో పాటు తప్పులు, అందాలతో పాటు వికృతాలు కనిపించక మానవు. ఆస్థానకవి కదా అని అందలం ఎక్కించడం రాజాశ్రయ బుద్ధి మనలో ఇంకా వసించడమే. తాము చెప్పింది చచ్చినట్లు నమ్మితీరాలనడం లేకపోతే తిట్టడం ఇదంతా పాఠకలోకంమీద అత్యాచారమే అవుతుంది.

అలాగే ఈమధ్యవిమర్శలలోనూ, రచనలలోనూ, కవితలలోనూ సామాజిక స్పృహ అంటూ సమాజానికి ఏవిధంగానూ ఉపయోగపడని వైఖరి; ప్రజాసాహిత్యం అంటూ సామాన్య పాఠకునకే కాదు కాస్త చదువుకొని సాహిత్యపరమైన కృషిచేసేవారికీ అర్థంకాని పరిస్థితి; మాట్లాడితే ఫ్రాయిడ్, అడ్లర్ అంటూ ఎవరో కొందరు అప్రాచ్యుల పేర్లుఉదహరించడం...ఏమిటో అంతటా అయోమయం తాండవిస్తోంది ఎక్కడ చూచినా. ఏనాడో మన తార్కికులు నమిలి ఉమిసిన మానవతత్వాన్ని తిరిగి విదేశీ కళ్ళద్దాలతో తిరగతోడుతూ అదేమంటే 'అన్నీ మన పురాణాల్లోనే ఉన్నాయష' అంటూ వెక్కిరింతలతో కాలరెగరేసే నేటి విమర్శకులు కాస్త అభిమానధనులై ప్రాచీన వాఙ్మయాన్ని తిరగేస్తే ఈ పునరావృత్త ధోరణి కొంత తగ్గుతుంది. ఈ పునరావృత్తత్వం ఇలాగే సాగితే మన సాహిత్యం పురోగతి అనే ముసుగులో గానుగెద్దులా తిరుగుతుంటుంది ఇలాగే.

అభిమానం అవసరం అన్నందుకు విమర్శకులు కలాలు నూరవచ్చు. కాని ఒక సంఘటన ఉదాహరిస్తాను. నా మిత్రుడొకడు రష్యాలో ఒక ప్రభుత్వ సంస్థకు ఇంగ్లీషులో ఉత్తరం వ్రాశాడు. వాళ్ళు దాన్ని వెనక్కు త్రిప్పి పంపుతూ ఇలా వ్రాశారు.

'మీకు జాతీయభాష లేదా? వ్రాస్తే మీ జాతీయభాషలో వ్రాయండి. లేనిచో మా భాషలో వ్రాయండి. ఇలా మరో భాషలో మానుండి సమాధానం ఉండదు.'

దీన్నిబట్టి ప్రతిదేశము తమకున్న సంపద కొద్దిగానైనా భూతద్దాలతో ప్రపంచానికి చూపుతున్న తరుణంలో అపార సంపద కలిగిఉండికూడా మనం మరొకరిని ముట్టెత్తుతున్నామంటే మన దౌర్భాగ్యం. అంతే. ప్రక్కవారిని చూచి అయినా కొంత అభిమానం సంతరించుకొని పురోగమించడం, అలా పురోగమిస్తున్న పొరుగువారి దృష్టిలో అభిమానహీనులుగా కనిపించకుండా ఉండటం మన విధి, కర్తవ్యం.

——•••——

# స్వామినేని ముద్దునరసింహ నాయుడుగారు

– శ్రీ దిగవల్లి వేంకట శివరావు, బి.ఏ., బి.ఎల్.

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారికి పూర్వము ఆంధ్ర విజ్ఞాన వికాసానికి దోహదము చేసిన మహాపురుషులలో రాజమహేంద్రవరం కాపురస్థులైన స్వామినేని ముద్దునరసింహ నాయడుగారొకరు.

నాయడుగారి చిన్నతనంనాటికి మన దేశంలో ఇంగ్లీషు నేర్పే పాఠశాలలు లేనందువల్ల ఆయన చెన్నపట్టణము, అక్కడనుండి తంజావూరు, వెళ్ళి అక్కడ రాజాగారు స్థాపించిన ప్రాథమిక పాఠశాలలో ఇంగ్లీషు నేర్చుకొని ఇంగ్లీషు కంపెనీ సర్కారువారు 1802 సం॥లో స్థాపించిన న్యాయస్థాన కచేరీలలో ఒక చిన్న ఉద్యోగంలో ప్రవేశించి షష్టుక్లాసు జిల్లామునసబుగా ఉపకారవేతనము పొంది 1856 సం॥లో దివంగతులైనారు.

వీరు స్వయంకృషివల్ల అనేక ఇంగ్లీషు గ్రంథాలను చదివి శాస్త్రీయ విజ్ఞానమును సంపాదించి, ఆ విజ్ఞానమంతా తెలుగు వారికికూడా అందజేయవలెననే మహదాశయంతో 'హితసూచని' అనే ఒక ఉద్గ్రంథమును తేటతెలుగులో రచించారు. దానిని వారి కొమారుడు 1862 సం॥లో అచ్చువేయించి ప్రకటించారు. ఈ గ్రంథమును వీరేశలింగము పంతులుగారు చదివి ఇందులోని భావముల ప్రాశస్త్యమును గ్రహించి వానిని తమ రచనలలో అనుకరించారు. పంతులుగారు వివేకవర్ధని పత్రికలో 1875–1876 సం॥లో దయ్యములనుగూర్చి వ్రాసిన వ్యాసములలోని భావము లన్నీ నాయుడుగారు రచించిన హితసూచనిలోనివే! ఇంతేకాదు; నాయుడుగారు వాడుకభాషలో వ్రాసిన భాగములను పంతులుగారు గ్రాంథికభాష లోనికి మార్చారు!! దీనివలన పంతులుగారిపైని నాయుడుగారి భావముల ప్రభావము ఎంతపనిచేసినదో తెలియగలదు. ఇటీవల డాక్టరు కొత్తపల్లి వీరభద్రరావు గారు తమ పిహెచ్. డి. పట్టము కొరకు వ్రాసిన 'తెలుగు సాహిత్యముపైన ఇంగ్లీషు ప్రభావము' అను సిద్ధాంత గ్రంథములో దీనిని గూర్చి వివరించియున్నారు. నాయుడుగారు హితసూచనికి వ్రాసిన పీఠికలో అనేక అపూర్వసూచనలు చేశారు. అందులో స్త్రీలకు విద్య అవసరమని ఉద్ఘాటించారు. హితసూచనిలోని 'విద్యాప్రమేయము' అనే ప్రకరణములో తెలుగులో సులభశైలిలో పాశ్చాత్య ప్రకృతి విజ్ఞాన గ్రంథాలను అనువదించి అచ్చువేయించాలని వ్రాశారు. వీరేశలింగం పంతులుగారు చాలాకాలం తరువాత ప్రకృతిశాస్త్రగ్రంథాలను రచించడానికి ఈ సూచన ప్రేరకమై మూలకారణమైనదనడానికి సందేహము లేదు. నాయుడు ఇలాగ వ్రాశారు :–

'శాస్త్రముల యొక్క గ్రంథములున్నూ ఇతరాంశములను గురించిన గ్రంథములున్నూ సులభముగా బోధపడేలాగు దేశభాషలలో పాఠ్య గ్రంథములుగా వ్రాయించి ప్రింటుచేయించి అవే బాలురకు చెప్పించే పక్షమునకు బాల్యకాలము లోనే శాస్త్రముయొక్క ఇతరములైన అంశములయొక్క జ్ఞానము వారికి త్వరగా కలుగడమునకు సందేహ మేమి యుండ లేదు. (పుట ౬)

'భూగోళశాస్త్రముయొక్క గణితశాస్త్రము తాలూకు క్షేత్రముయొక్క లెక్క యొక్క సిద్ధాంతభాగముయొక్క మరిన్నీ న్యాయశాస్త్రముయొక్క శారీరశాస్త్రముయొక్క వాక్యరూపములైన సంగ్రహములను ఏయే [ఆయా] దేశభాషలచేత అచ్చువేయించి చిన్నవాండ్లకు చెప్పించవలసినది. అయితే సంస్కృతము వగైరా భాషలయందు శారీరశాస్త్రము మొదలైనవి రచించిపబడియున్నవిగాని ఆ గ్రంథములు బహుప్రాచీనములైన విన్ని దరిమిలాను పరిశీలనవల్ల తెలియవచ్చిన సంగతులచేత అభివృద్ధిని పొందించబడనివిన్ని అయ్యున్నందున వానినిబట్టి యేయే (ఆయా) దేశభాషలకు సంగ్రహములు చెయ్యడముకంటె యింగ్లీషున ఇప్పట్లో వాడికెలో నుండే జియాగ్రఫీ, జ్యామెట్రీ, ఎరిత్మెటిక్, ఎస్ట్రానమి, ఫిలాసఫీ, ఎనాటోమి, అనేగ్రంథముల యొక్క సంగ్రహములు ఏయే దేశభాషలలో వ్రాయించి విద్యార్థులకు చెప్పించడము జరూరై యున్నది. (పుట ౭)

'...యింకా శాస్త్రముల యొక్క వ్యవహార్యాంశములయొక్క గ్రంథములు ఇంగ్లీషుభాషను విశేషముగా దిద్దుబాటుతో వృద్ధిపొందుచున్నవి గనుక వాటిలో జరూరైన ప్రమేయములు ఇంగ్లీషు గ్రంథములలోనుంచి దేశభాషలకు తర్జుమా చేయించి యేయే విద్యార్థియొక్క శక్తికిన్ని అనుగుణములైన గ్రంథములు చెప్పించటము యుక్తముగా తోచుచున్నది. (పుట ౧౦)

'ఇంగ్లీషు బాగా తెలిసి అసలు గ్రంథములయొక్క ముఖ్యాభిప్రాయములు సులభముగా బోధపడతగినట్లు దేశభాషను సంగ్రహములు చెయ్యడమునకు లాయఖైన సామర్థ్యముగలవారు పూనుకున్న పక్షమందు శాస్త్రసంబంధములైన సంగ్రహములలో నొకటొకటి తగిన కాలములో నేర్పాటు చేయవచ్చును. మరిన్నీ విద్యార్థులు చూచుకొనే నిమిత్తము శాస్త్రాలయొక్క యింకా జరూరైన అంశములయొక్క ప్రమేయములు చాలాగా ఇంగ్లీషుభాషయందుండే గ్రంథ

ములను బట్టి తర్జుమా చెయ్యవలసియున్నది. (పుట ౧౦)

ఈసూచనలను నాయుడుగారు 1856 వ సం॥మునకు పూర్వమే చేసియున్నారు; 1848 సం॥లో జన్మించిన వీరేశలింగం పంతులుగారు పెద్దవారై 1874 సం॥లో వివేకవర్ధని పత్రిక స్థాపించి అనేక వ్యాసాలు రచించిన తరువాత కొన్ని ఇతరగ్రంథాలు ప్రకటించిన తరువాత చాలాకాలానికిగాని ఈసూచనల ప్రకారము శాస్త్రగ్రంథాలు రచించ నారంభించలేదు. 1888 సం॥లో పంతులుగారు ప్రకటించిన శారీరశాస్త్రము యొక్క ఉపోద్ఘాతములో నిట్లువ్రాసిరి:- 'తెలుగు భాషయందు ప్రకృతిశాస్త్రములు లేని లోపము విస్తారముగా నున్నందున దానిని నివారించుటకయి యీశారీర శాస్త్రమును మొట్టమొదట నారంభించి యొకవిధముగా ముగింప గలిగినాడను. జనులలో మూఢవిశ్వాసములు పోవుటకు ప్రకృతిశాస్త్రజ్ఞాన మావశ్యకమని తలచి నేను మొట్టమొదట పదార్థవివేచక శాస్త్రమును సంవత్సరముక్రిందట ప్రశ్నోత్తర రూపమున రచించి ప్రకటించుచుండగా; ఆకాలమున పట్టణములో నుండిన కులాచార సంస్కరణ సమాజము వారా పనిని మరియొకరికి నిర్ణయించి శారీరశాస్త్రమును రచింపుమని నన్ను గోరిరి.' అని వ్రాసిరి.

దీనినిబట్టి నాయుడుగారి సూచనలు వారు వ్రాసిన 30 సం॥లు తరువాతగాని ఫలింపలేదని తెలుస్తుంది. ఆంధ్ర విజ్ఞాన వికాసానికి 1856 సం॥ నకు పూర్వమే దోహదము చేసిన నాయుడుగారి ప్రతిభను దూరదృష్టిని గ్రహించి వారి చరిత్రను పరిశోధించి రచించకపోవుట ఎంత అన్యాయము !!

శ్రీ స్వామినేని ముద్దునరసింహనాయుడు గారు హితసూచనికి వ్రాసిన పీఠికను శ్రీ గిడుగు రామమూర్తి పంతులు గారు తమ గద్యచింతామణిలో ముద్రించి 50 సం॥లు దాటినది. హితసూచని ఇంత వరకు పునర్ముద్రణము పొందకపోవుట ఆంధ్రుల దురదృష్టము.

ఆ పీఠికలో నాయుడుగారు వ్రాసిన విషయాలు చూస్తే ఆయన లోకజ్ఞానము, ప్రతిభ, వెల్లడి అవుతాయి. వీరేశలింగం పంతులుగారి కాలమునుండి గాంధీమహాత్ముని కాలమువరకు ఆంధ్రదేశములో జరిగిన సంఘసంస్కార ప్రయత్నాలకు ప్రేరకములైన సంస్కారభావాలు అందులో కనబడతాయి.

శరీరారోగ్యమునకు జరూరైన వైద్య విజ్ఞానమునుగూర్చి తెలుగులో గ్రంథాలు లేకపోవుటను గూర్చి నాయుడుగారు పరితపించారు. మన పురాణేతిహాసాలలోను కావ్యాలలోను ధర్మశాస్త్రాలలోను చెప్పబడిన అనేక విషయాలను గూర్చి చాలా మృదువుగా విమర్శించారు. ఆ గ్రంథాలలో అవాస్తవములైన సంగతులు కొన్ని వాస్తవములుగాను, అన్యాయములైన కొన్ని సంగతులు న్యాయములైనట్లుగాను చిత్రింపబడుటను, కల్పించబడుటను విమర్శించారు. ధర్మశాస్త్రములలో విధినిషేధాలు పరస్పరవిరుద్ధముగా నుండుటను గూర్చి విమర్శించారు. వివిధ కాలములలో మనదేశాన్ని పాలించిన రాజులు వారి నాశ్రయించిన బ్రాహ్మణ పండితులు తమతమ కిష్టమైన విధముగా ధర్మశాస్త్రములను దిద్దుబాటు చేయుటను గూర్చి కూడా విమర్శించారు. ఇటీవల ఉన్నత న్యాయస్థానములలో మన ధర్మశాస్త్రాలను గూర్చి జరగిన చర్చలందీ విషయాలు స్పష్టీకరింపబడినవి. దీనిని బట్టి నాయుడుగారు కుశాగ్రబుద్ధి గలవారని తెలుస్తుంది.

హితసూచనిలో విద్యాప్రమేయము, వైద్యప్రమేయము, సువర్ణప్రమేయము, మనుష్యేతర జంతు సంజ్ఞాప్రమేయము, రక్షఃప్రభృతి ప్రమేయము, మంత్రప్రమేయము, పరోక్ష విజ్ఞానప్రమేయము, వివాహ ప్రమేయము అని ఎనిమిది ప్రకరణములలో భారత దేశోద్ధరణ కావశ్యకములైన అనేక విషయాలను గూర్చి చక్కగా చర్చించారు. ఆ చర్చలలో నేటి కాలమునకు కూడా వర్తింపగల ధర్మ సూక్ష్మా లున్నవి.

హితసూచని ప్రతి యొకటి వీరేశలింగము గారి గ్రంథసంచయంలో నుండి గౌతమీ గ్రంథాలయమునకు వచ్చి చేరినది. ఆంధ్రసాహిత్య అకాడమీ వారికి గాని, విశ్వవిద్యాలయము వారికి గాని మరల ముద్రింపదగిన గ్రంథము హితసూచని.

—+—

* నిజమైన మధురకవి శ్రీ నాళం కృష్ణారావుగారొక్కరే - శ్రీ సహదేవ.
* శ్రీ చిన్మయబ్రహ్మ కవిగారో !!

# శ్రీనాథుడు - శివాద్వైతము

- శ్రీ అ. నరసింహశర్మ.

(గతసంచిక తరువాయి)

ఆద్యావస్థలో ద్వైతభావము ఉన్నా క్రమంగా సాధకుడు అద్వైతస్థితినందుతాడు.

ఈ ఉపాసన భావన, మంత్రము. యంత్రము, రూపము, పూజ, స్తవము. మొదలైనవానితో ఉంటుంది.

రూపము, పూజ, విభూతిరుద్రాక్షాది ధారణము, మొదలైనది బాహ్యము. మానసికం అంతా అభ్యంతరము. చింతనాదులు అంతర్యాగము. దైవము అంతర్యాగ సమారాధ్యము. బహిర్యాగ సుదుర్లభము.

వానిరహస్యాలు, వివరాలు శాస్త్రగమ్యాలు. కవి వానిని నిరూపించేడు. ఆవివరణ ప్రత్యేకమైనది.

అయినా కాయ వాఙ్మనసాలలో ఉత్తరోత్తర చింతనము ఉత్తమము.

వేదార్థాన్ని వివరించుటలో 'స్మృతి సూత్ర పురాణాద్యైః వేదార్థ ముపబృంహయేత్' అంటారు. కాబట్టి అర్చన కళాశాలియై శాస్త్రస్మృతులు సూత్రము గ్రహించి అర్చనచేసే డని తెలిసింది. ఇంక పురాణాదులను సమన్వయపరచేడనేది రెండవవిశేషణం చెపుతూంది.

భక్తుడై నిత్యకర్మలను వర్ణాశ్రమాది విహితములను ఆచరించాలి. ఆవిషయాన్ని-

విద్యాంచా విద్యాంచ
యస్తద్వేదోభయం సః
అవిద్యయా మృత్యుంతీర్త్వా
విద్యయామృత మశ్నుతే

అనే సంహితోపనిషన్మంత్రము వివరిస్తూంది.

అవిద్య అంటే కర్మలు. విద్యఅంటే ఇక్కడ దేవతోపాసన. ఈ రెంటిలో ఏఒక్కటీ తిరింపచేయలేదు. రెండూ కలిసిచేయాలి, వృత్తము ఉండాలి. వారు బ్రహ్మస్వరూపావగతి లక్ష్యంగా ఉంచుకోవాలి. అలాటివాడు ఉత్తరాయణ మార్గంలో ఉత్తమగతి నందుతాడు అని భావము.

ఇక్కడ సముచ్చయవాదాన్ని కల్లూకభట్టు, మొదలైనవారు సూచించేరు. శంకరభగవత్పాదులు సముచ్చయవాదాన్ని అంగీకరించలేదు. జ్ఞానమొక్కటే జీవన్ముక్తి మార్గం అని వివరించేరు. అయినా కర్మలు ఈశ్వరభక్తివృత్తము దీనినందరూ అంగీకరించేరు. ఇదే స్మృతిమార్గము గీతా చెపుతుంది.

కర్మలు వృత్తము చక్కగా పెద్దన నిరూపించేడు. భక్తిని పోతనాదులు గ్రహించేరు, భక్తికిపరమావధి ప్రయోజనము ప్రసాదము. దానివల్ల జ్ఞానం మోక్షము కలుగుతాయి అని వారి సమన్వయము. కళాపూర్ణుని, పుండరీకుని ఈమార్గంలోనే ఆకవులు చిత్రించేరు. ఇవన్నీ ఆగమశిఖలు వ్యాపించితేనే పూర్ణబోధను కలిగిస్తాయి.

అంచేతనే భక్తులు కర్మలను విడువరు. ఇదే పిపీలికామార్గము. జ్ఞానము విహంగమమార్గము. ఇది శ్రుతి స్మృతి పురాణసమ్మతము. కేవల శివకవులు శివసేవ ఒక్కటే అంగీకరిస్తారు. అద్వైతులది శివాద్వైత మార్గము. వ్యాసుడు శివాద్వైతికాడు. కేవలమాహేశ్వరులచే బహిష్కరింపబడ్డాడు. అయినా వారిని వీడలేదు.

ఈవిధమైన శైవమే శ్రీనాథుడిది. అంచేతనే సకల పురాణాలకు తాత్పర్యము బ్రహ్మావగతి అని నిర్ధారణచేసేడు. అంతేకాని కేవల శివానుగ్రహ మనలేదు. శివుడు ఆత్మవిభూతి, ఆత్మగమ్యము, ఆత్మావగతికి శివుడాలంబనము. ఓంకార వాచ్యుడు శివుడు ఇది వాని తాత్పర్య నిర్ణయము-

తాత్పర్యము అంటే వ్యంగ్యముకాదు. విద్యానాథుడు తాత్పర్యార్థోపి వ్యంగ్యార్థ ఏవ అన్నాడు కాని ఇదిసరికాదు.

హేతువు నియమితమైతే అది వ్యంగ్యము కాదు. (ధ్వనికాదు) హేతువు అనియతమైనా స్ఫురించేదే ధ్వని అని ధ్వన్యాచార్యులు పండితరాయలు వివరించేరు. అనుమానమునకు ధ్వనికి ఇదే భేద మని వారు వివరించేరు.

ఆకులింగములచేత నియతమై స్ఫురించేది తాత్పర్యార్థము. వేదాదుల అర్థ నిర్ణయం శ్రీనాథుడు చేసేడు. వానితాత్పర్యం బ్రహ్మజ్ఞానము అని భావము. పురాణాలు అభ్యర్హితాలు. బ్రహ్మము, విభూతుల కన్న అభ్యర్హితము. అదే పరమలక్ష్యము. పురాణాలూ అభ్యర్హితాలే. ఆబ్రహ్మము కళద్వారా గమ్య మవుతుంది. ఆకళ చిత్కళ. ఆబ్రహ్మము 'ప్రాణ మసృజత. ప్రాణాచ్ఛ్రద్ధాంఖం వాయుర్జ్యోతిరాపః పృథివీంద్రియం మనః। అన్నమన్నాద్వీర్యం తపోమంత్రాః కర్మలోకా లోకేషు చ నామ చ. ప్రాణము దగ్గరనుండీ పదునారు కళలు ఈశ్వర కళలు.

ఇవన్నీ ప్రాణుల అవిద్యాఫలాలు. ఇవన్నీ ఆత్మ యందే ఉత్పన్నములయి పెరిగి లయమవుతాయి. అరరలు రథనాభియందువలె ఈశ్వరునం దివి ప్రతిష్ఠింపబడినవి. కాన వీనిద్వారా ఈశ్వరుడు పరమాత్మ అధిగత మవుతుంది. అంచేత పురాణాలు కళావైభవాలను వర్ణించి వానిద్వారా ఈశ్వరుని వానిద్వారా నిరస్తసమస్తోపాధికుని అవగతము చేసికొని ముక్తుడగుట పరమావధి అని భావము. కాబట్టి బ్రహ్మజ్ఞాన సాధకమగు కళ వీనికి నిధానమవును.

లేదా బ్రహ్మజ్ఞానమునకు కళానిధానమవు. చంద్రుడవు. సంసార తాపత్రయాపహారణకు నీ బోధ చంద్రమరీచి అని భావము.

జ్ఞానం వస్తువు. కాబట్టే జ్ఞాని అంటే జ్ఞానస్వరూపుడు అని భావము. మతు బంతిము కారాదు. అప్పుడు జ్ఞానం ధర్మము అవుతుంది. అది ఉపనిషన్మతము కాదు. అంచేతనే సర్వజ్ఞుడు అనేటప్పుడు సర్వశ్చాసౌ జ్ఞశ్చ అనివిగ్రహం చెపుతారు. సర్వంజానాతి అనుటతప్పుకాదు. సగుణము బ్రహ్మజ్ఞానము, ఈశ్వరార్చన, భిన్నంగా వ్యవహరింపబడి యీ రెండు విశేషణాలచేత అభివ్యక్త మవుతున్నాయి. ఈ రెండూ భిన్నము లగుట ఒక్క శివాద్వైతములోనే సాధ్యమవుతుంది. సోమనాథాదుల శైవంలో ఈ రెండూ భిన్నంగా వ్యవహరింపబడవు. శివునికన్న పరమైనది ఏదీ లేదు. శివ సాయుజ్యము వారిమతంలో ముక్తి అంచేత ఆమతాన్ని అనుసరించి వ్యాఖ్య చేయుట సమన్వయం లేనిది అవుతుంది.

కాబట్టే శ్రీనాథుడు రామాదులను విష్ణువును కూడా భక్తితో నుతించేడు.

పోతనగారి వైష్ణవం ఇలాటిదే. అన్ని పురాణాలకు బ్రహ్మజ్ఞానమే తాత్పర్యం కావాలంటే ఒక్క అద్వైతంలోనే సాధ్యము. శివపురాణాలకు వలె విష్ణు, వామన, నారసింహ, కూర్మ, మత్స్య పురాణాలు వైష్ణవాలకు తాత్పర్యం బ్రహ్మజ్ఞానమందే అగుట ఒక్క అద్వైతంలోనే సాధ్యమవుతుంది.

ముక్తికి మహాభాగ్య మనేది కవివ్యవహారము. దానినే సంపత్ అంటారు. కాబట్టే నీభాగ్యము సామాన్యమా అని అమాత్యుని నుతి.

ఇంక ఉపాసనాక్రమాలు సంప్రదాయాలు లక్ష్యాలతో నిరూపించుట పసివారికి తమ్మి నమలి అందించడంలా

# మందార మకరంద మాధుర్యము

- శ్రీ కే. కిశోరుబాబు, ఎం. ఏ.
- శ్రీ కే. అశోకబాబు, బి. ఎస్‌సి. (అగ్రి)

ప్రహ్లాదచరిత్రలోని మందారమకరంద పద్యము తెలియని తెలుగువా రుండరు. (7 150) అందరికి చిరపరిచితమైన పద్యమది. పాలవంటి భక్తిని పంచదార వంటి శబ్దములను కలబోసి పాయసమువలె తియ్యగా వండినాడు దానిని బమ్మెర పోతనగారు. పోతనగారు వండిన ఆపరమాన్నము వంటి పద్యము నేటికి కూడా పులియక, పుళ్ళక, అతి మధురమై మాటిమాటికి అందరిని ఊరింప జేయుచునే యున్నది. పాసెమువలె ఆ పద్యమును కమ్మగా తయారుచేయుటకు కావలసిన పదార్థ సంచయమును పోతన

ఎవరెవరినుండి అరువు పుచ్చుకన్నాడో ఇంచుక పరిశీలింతము.

రామసర్ప ఫణామణి, రామచంద్రుని చిత్తపదము అయిన సీతకు అతనిపైదప్ప అన్యునిపై అనురాగమే మొడ్కొ సమ కూడునని చెప్పు సందర్భమున అయ్యలార్యుని రామాయణమున

మందార భూజంబు మరగిన భృంగికి
పిచుమంద శాఖిపై ప్రేమ గలదె
లలిమానసంబున మెలగెడు హంసికి
వెలయు బల్వలముపై వేడ్క గలదె
మలయ ద్రుమంబున మలయుభుజంగికి
బర్బూర తరువుపై వలపు గలదె
భాస్కరోదయమున భాసిల్లు పద్మిని
కిందుకరస్పృష్టి నెలమి గలదె
రాజితానేక సద్గుణారామ, రామ
కర్మపాలనపరమ నీధర్మపత్ని
యైన సాధ్వికి సీతకు నన్యునందు
గూర్మి యే చందమున సమకూడునయ్య.

(అయ్యలభట్టు భాస్కర రామాయణము యుద్ధకాండ 24|6) అను పద్యము గలదు.

బిజ్జలుడు కోపించి బండారి బసవన దండనాయకుని పిలిపించి మాసొమ్ము మాకిచ్చిపొమ్ము అని పలికినపుడు గించిత్ప్రహసితాస్యుడగుచు అతడు జననాథునితో

బగతు డాసించునే పరధనంబునకు
మృగపతి యెద్దస మేయునే పుల్లు
క్షీరాబ్ధిలోపల గ్రీడించు హంస
కోరు నె పడియలనీరు ద్రావంగ
జూతఫలంబులు చుంబించు చిలుక
భ్రాంతి బూరుగు మ్రానిపండ్లు గన్గొనునె
రాకామల జ్యోత్స్న ...
మా కాంతు సేయు ... చీకటి ద్రావ




ఉంటుంది. బాలురకి ఉపయోగపడుతుంది. అది సావకాశంగా అయ్యే పని.

దేవతావిగ్రహప్రతిష్ఠలో పంచాధివాసాలు జరుపుతారు. ఇది పంచాగ్నివిద్యా విధి ననుసరించి జరుగుతుంది. తరువాత కళాన్యాసం చేస్తారు. అప్పుడుగాని విగ్రహానికి ఆరాధ్యత్వం, ప్రతిష్ఠా లేవు. ఆకళ దివ్యకళ. అదే ఆరాధ్యము. కేవల విగ్రహం కాదు. కళ, నామరూపోపాధి నాశ్రయిస్తుంది. ఆరాధ్య మవుతుంది.

నవవిధ భక్తులకన్న నారదభక్తి, అంతకన్న శాండిల్యభక్తి, ఉత్తమ మని పెద్ద లంటారు.

శిల్పసౌందర్యాన్ని, మెచ్చి తద్ద్వారా శిల్పిని అవగతం చేసికున్నతీరున దైవీకళావిభూతులైన జగత్తును చూచి ఆకళద్వారా ఈశ్వరారాధన చేయుట శాండిల్య విద్య. ఇదంతా కళారహస్య విదులకు విశదమవుతుంది. కాబట్టి అట్టి కళావిదుడైన శ్రీనాథునకు నమోవాకములు.

—+—

విరిదమ్మివాసన విహరించు తేటి
పరిగొని నుడియునే ప్రబ్బలివిరుల
నెఱుగునే యలదిగ్గజేంద్రంబు కొదమ
యెఱపంది చనుసీక? నెఱుగవుగాక
(బసవపురాణము 3_32_42)

అని వచించినటుల పాలకుర్కి సోమన బసవపురాణమునందు గలదు.

అతని బసవపురాణమునందే కాక చతుర్వేదసారమునందుగూడా ఈ భావముల ముద్రణము కన్పించుచున్నది.

రాకామల జ్యోత్స్న ద్రావునిచ్చలుగొన్న
నాచకోరంబుల కరుచి యగునె?
సహకార పల్లవ చయముల దొరకిన
జగతి కోయిలకును చప్పనగునె
క్షీరాబ్ధిలో పల గ్రీడింపగల్గిన
భువి రాజహంసకు పుల్లనగునె
బహుళతర దయార్ద్రభావ ప్రభావస
మహిమ దనరు జంగమంబు రాగ
నతుల భక్తిపరుల కావశ్యకంబగు
పరిహృతాభిభంగ బసవలింగ
(చతుర్వేదసారము 153 ప.)

పర్ణశాల ముంగిట సీతను జూచి ఏను దానవనాయకుడను రావణుడను మదీయ వల్లభవై సుఖింపగ రాదె అని మదనవివశుడై పలికిన రావణుని గని సీత భయకంపిత దేహ యగుచు ఇట్లాడ సర్వామే యే నేడ? నీవేడ? కరిణి యేనాట సూకరము గలయు ?

మహిత కమల మధుర మధు రసాస్వాదన
పరవశాత్మయైన భ్రమరకాంత
రిత్తబుద్ధి నకట రేగు పువ్వులరసం
బానునెట్లు? చేలవైతి గాక
(అరణ్యపర్వము 6_341)

అని పలికినటుల ఎఱ్ఱన ఆరణ్య పర్వశేషమునందలి రామాయణ కథాఘట్టమున గలదు.

అయ్యలార్యుడు సోమన ఇంచుమించు సమకాలికులు. ఎఱ్ఱన వీరి తరువాతివాడు. పోతన వీరి మువ్వురి పద్యములను మూలకొనియే మందారమకరంద పద్యమును సంతరించినా డనవచ్చు. అందువలననే దానికంతటి ఘుమఘుమ. రుచి. (పోతనపై భాస్కర రామాయణ ప్రభావమున్న దని నిడుదవోలువారు ‘పోతన’ అను గ్రంథములో నిరూపించినారు) అయ్యలార్యుడు భుజంగినిని పద్మినిని పాలకుర్కి సోమన చిలుకను పేర్కొనినారు. పోతన వాటిని పరిహరించినాడు.

మందార వృక్షముపై వసించగోరు భృంగి వేపకొమ్మల వసించగోరునా అని అయ్యన తామరపూవుల విహరించు తేటి ప్రబ్బలిపువ్వుల విహరించ వాంఛించునా అని సోమన కమలము నందలి తేనెను గ్రోలు తుమ్మెద కాంత రేగుపువ్వుల రసము గ్రోల నిచ్చగించునా అని ఎఱ్ఱన వర్ణించినారు. పోతన సోమన, ఎఱ్ఱన, తెలిపిన భావములను విడచి అయ్యన భావమునే స్వీకరించినాడు గాని దానిని మందార మకరంద మాధుర్యమున నోలలాడు రోలంబము మదనములను అనగా ఉమ్మెత్త చెట్ల నాకాంక్షించునా అని ఉచితమైన మార్పును గావించినాడు. అతులితమైన మందార మకరందము నాస్వాదించిన షట్పదము వేముపై మరులుగొనునా అనుటకు బదులు మదము కలిగించు మదనముల చెంతకు చేరునా అనుటలో పోతన ప్రతిభ వ్యక్తమగుచున్నది. క్షీరాబ్ధిలో గ్రీడించు హంస అని పాలకుర్కి తెలిపిన అభిప్రాయమునకు మారుగా లలిమానసంబున మెలగెడు హంసి అని అయ్యలార్యుని అభిప్రాయమునే ఒరవడిగా గ్రహించి నిర్మల మందాకినీ వీచికలదోగు రాయంచ అని పోతన సుందరోజ్వలముగా వర్ణించినాడు. రాకామలజ్యోత్స్న ద్రావుచకోరమని సహకారపల్లవచయ మని సోమన అస్పష్టముగా చెప్పిన భావములను పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం బరగునే సాంద్ర నీహారముల కని లలిత రసాలపల్లవ ఖాదియై చొక్కు కోయిల చేరునే కుటజముల కని పోతన మురువుగా విస్తరించి రోచమాన మొనరించినాడు. మందార మకరంద పద్యమును మందార అని తగణముతో ప్రారంభించినాడు పోతన. తగణము శుభప్రదమయిన గణము దాని కధిదైవము ఆకసము.

‘తగణంబున కధిదైవము
గగనం బది శూన్య మనుచు గాదని
పలుకన్
దగ దది మిక్కిలి మంచిది
గగనం బొగి నిత్యవిభవుగా జేయు నిలన్.

అని తగణముయొక్క మహిమను సులక్షణసారకర్త ప్రశంసించినాడు. మందార కుసుమమునందలి తేనెను ద్రావి పరవశించు మధుపము మదనముల పొంతకు బోవ అభిలాషపడ దను సామాన్యార్థమునేకాక కల్పవృక్షపు చాయల పులకించు చంచరీకము ఉన్మత్తపునీడల తిరుగుటకు లాలసపడ దని ఆకాశాధిపతి గణమగు తగణముద్వారా సూచించినాడు. (మందారమునకు కల్పవృక్ష మని అర్థము. కల్పవృక్ష ముండునది స్వర్గమున. స్వర్గమన ఆకాశమే కదా. స్వర్గమునకు నాక మను పేరుగలదు. నాక మనగా ఆకాశమని కూడా అర్థము) మందారమునకు సంతోషింప జేయునది యని వ్యుత్పత్తి. (మకంతి మోదంతే అనే నేతిమందారం గురుబాల ప్రబోధిక) అ బుజ్జోదరునిపై భక్తిగూడా మానవులను సర్వదా సంతోషింపజేయుచుండు నని ఈపదముద్వారా పోతన సూచించినా డనవచ్చు. రెండవ చరణము నిర్మల అను భగణముతో ప్రారంభించినాడు భగణమున కధీశ్వరుడు చంద్రుడు. మందాకిని చంద్రునివలె ధవళమైన దని తెలుపుటకు భగణము నుపయోగించినాడు పోతన. నిర్మల అను విశేషణ వాచకమును అందువలననే మందాకిని పదము మొదట ప్రయోగించినాడు. నిర్మల మందాకినీ వీచికలలో అనగా చంద్రునివలె నిర్మలమయిన తెల్లనయిన

గంగాతరంగములలో దూగు రాయంచ చనునా తరంగిణులకు అను నర్థమును భగణమువలన నిపుణముగా తెలియజేసినాడు. మూడవచరణమును లలిత అను నగణముతో ప్రారంభించినాడు. నగణమున కధినాయకుడు శ్రీమహావిష్ణువు. శ్రీమహావిష్ణువువలె లలిత శృంగారరసావిష్కరణము గావించు పల్లవములు గలిగిన సహకార మని నగణము సహాయమున ప్రశంసనీయముగా తెలియజేసినాడు. లలితరసాలపల్లవ మను పదప్రయోగము దానినే ప్రకటించుచున్నది. రసాలపల్లవములు సుకుమారము లనుటకు లలిత అని లఘ్వక్షరములనే వాడినాడు. నాలుగవ చరణము పూర్ణేందు అని మరల తగణముతోనే ప్రారంభించినాడు. పూర్ణేందు చంద్రిక కాస్పదమైనది ఆకాశమే గదా. అందువలన దానిని పూర్ణేందు అని ఆకాశాధిపతిగణమగు తగణమువలన సూచించినాడు. పద్యమున మకారరకారముల పునరావృత్తి వింత చెలువు లొలుకుచున్నది. అది మర, రమ అను రామనామమును గూడా స్ఫురింపజేయుచున్నది. (మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు వోవునే మదనములకు, నిర్మ (రమ) ల మందాకినీ వీచికల దూగు రాయంచ) మా, రాకు హత్తించిన బుద్ధి లతకు మారాకు హత్తించినట్లయి పరిపూర్ణమైన తేజస్స్వరూపము గోచరించునని, మనిషికి శ్రీకైవల్యపదము సిద్ధించునని పోతనగారే ఒకచోట పేర్కొనినారు. (8-65)

మాటలు వేయునేల పోతనగారి మందార మకరంద పద్యమొక వజ్రము వంటిది. సానబట్టినకొలది దాని ధగధగలు బయల్పడుచునే యుండును.

మందారమకరంద పద్యమున పేర్కొనిన భావము లనిన పోతనకు మిక్కిలి యిష్టములైనట్లు కన్పించుచున్నవి. అతని మొట్టమొదటి దండక మగు భోగినీ దండకములో అచ్చముగా అవే పింపిసలాడుచున్నవి.

'సింగభూపాలుపై వ్రాలి నాచిత్తమున్మత్తమై సోలి కామానలాయత్తమై రాదు, తేరాదు నే నామరుండైన గౌరీవరుండైన వాణీధవుండైన దేవోత్తరుండైన నన్యున్ మదిం గోరగా నొల్లనే? ఉల్లసత్ఫుల్ల మందార రాజన్మరందంబునం గ్రోలు మత్తాళి దుత్తూరముం గ్రోలునే? హేమ రాజీవ రాజీ రజో రాజితాకాశ గంగానదీ లోలకల్లోల డోలానట ద్రాజహంసంబు శైవాలగండూపదీ భేక భేకీధునీ సంకులాసార కాసారముం జేరునే? మండితాఖండ లానీల జీమూత నిర్యత్పయోధారలన్ ద్రావుసారంగి కుంభాంతరాంభః ప్రపూరంబులన్ ద్రావునే మాధవోజ్జాత చూతాంకుర స్వాదులీలా లసత్కోకిలేంద్రంబు ఝుల్లీకర క్రూర భల్లాతకీశాఖకున్ బోవునే.

మందారమకరంద మాధుర్యమున దేలు మధుపంబుపోవునే, మదనములకు, అను భావమునే వర మందార మరంద పానకుతుక స్వాంత ద్విరేఫంబు సత్వరమై పోవునె చేతివేములకు తద్గంధానుమోదాత్మమై (3-223) సుపర్వమహీజ మరంద పాన లాభాను భావంబు నొందు మధుపంబునుబోవునె వేపచెట్లకున్ (3-441) పారిజాత కుసుమస్ఫుటనవ్యమరంద లుబ్ధశోభానయశాలి యైన మధుపంబు భజించునె యన్య పుష్పమున్ (4-925) వనజంబానెడితేటి యొండు కుసుమావాసంబపేక్షించునే (9-529) పద్మగంధముల్ మరగిన తేటు లన్య కుసుమంబుల చెంతలఁ జేర నేర్చునే (10-1-991) అని చిరుచిరు మార్పులు గావించి పలుసార్లు వర్ణించినాడు పోతనగారు. (భాగవతమున)

రుక్మిణీదేవి శ్రీకృష్ణుని స్తుతించు సందర్భమున

నీరదాగమ మేఘ నిర్యత్పయః పాన
చాతకం బేగునే చాటిపడెడు
బరిబక్వ మాకంద ఫలరసంబుల గ్రోలు
కీరముల్ చనునె దుత్తూరములకు
ఘనరవాకర్ణనోత్కలిక మయూరముల్
గోరునే కఠిన ఝిల్లీరవంబు
కరికుంభ పిశిత సద్గ్రాస మోదిత సింహ
మరుగునే శునక మాంసాభిలాష
బ్రవిమలాకార భవదీయ పాదపద్మ
యుగసమాశ్రయ నైపుణోద్యోగచిత్త
మన్యు జేరునే తన కుపాస్యంబు గాగ
భక్త మందార దుర్భర భవవిదూర
(దశమ ఉత్తర 257)

అను మందార మకరంద ధోరణిలోనే మరొక సీసమును రచించినాడు. ఇందలి ఉపమాన వాచకములన్ని కొంగ్రొత్తగానున్నవి. పాలకుర్కి సోమన చూతఫలంబుల చుంబించు చిలుక పరిక్వమాకంద ఫలరసంబుల గ్రోలుచు ఇందు ప్రత్యక్షమైనది. అది బూరుగుమ్రానిపండ్లను గనుగొనునా అని పాలకుర్కి వర్ణించగా దుత్తూరములకు చనునా అని పోతనవర్ణించినాడు. కరికుంభ పిశితసద్గ్రాస మోదిత సింహమరుగునే శునకమాంసాభిలాష అను చరణమునందలి భావము మదేభ కుంభ పిశిత గ్రహాలాలస శీల సాగ్రహాగ్రేసర భాసమాన మగు కేసరి జీర్ణతృణంబు మేయునే మత్తేభేంద్ర విభిన్నకుంభపిశిత గ్రాసైక బద్ధస్పృహః కిం జీర్ణతృణమత్తి మాన మహతా మగ్రేసరః కేసరీ) అను భర్తృహరి సుభాషితమునకు అనుకరణమువలె నున్నది. మృగపతి యొద్దెస మేయునే పుల్లు అను పాలకుర్కి ద్విపదపంక్తి కూడా ఈ భావమునే వెలిబుచ్చుచున్నది. మందారమకరంద పద్యమంత శ్రుతి మధురముగ లేకున్నను ఈపద్యముగూడా మరొక మంచిపద్య మనవచ్చును.

( సశేషం )

# 'జీవనయాత్ర' - నవల

- శ్రీమతి ఎం. సావిత్రి, ఎం.ఏ., బి.యిడి.

సుఖదుఃఖాలు మానవజీవిత సహజాలు. అనుభవజ్ఞులు 'మానవుడు సుఖముతో పొందే అనుభవం కంటె కష్టాలలో, అనుభవాన్ని, నిదానాన్ని, వివేకాన్ని నేర్చుకుంటా' డంటారు. బండి చక్రము ఆకులవలె వ్యక్తి జీవితంలో ఇవి ఒకదాని తరువాత ఒకటివస్తాయి. ఆ ఆశే మనిషిని జీవింపజేస్తుంది. కాని కొంతమంది జీవితం కేవలం కష్టాలకొరకే విధాత చేత సృష్టింపబడుతుందా? అనిపిస్తుంది. వారి కష్టాలకు నిష్కృతి ఉండదు. ఒక కష్టాన్ని ఎట్లాగో ఓర్చుకొని పాతదానిగా చేసేలోపలే ఏదో ఒకకష్టం తలుపు తోసుకుని గృహం ప్రవేశిస్తుంది. అటువంటి వారిజీవితాలపట్ల సానుభూతితో నిండిన ఒక నిట్టూర్పును విడవడం తప్ప ఏమీ చేయలేము! అటువంటి కష్టాలలో ప్రశాంతమైన జీవితాన్ని గడిపి జగమంతా శోకించేలాగ భగవత్సన్నిధిలో ప్రాణాలు విడిచిన పుణ్యమూర్తి కథేతివృత్తమే 'జీవనయాత్ర' నవల. శ్రీ మాదిరెడ్డిగారి కలంలో యీనవల సంతరించుకున్న గమనం పరిశీలిద్దాం.

కాల్చిగంపకత్తె పినతల్లి లక్ష్మినర్సమ్మ ఆమెభర్త కష్టయ్యల పెంపకంలో శాంత యౌవనంలోక అడుగుపెడ్తుంది.

సంప్రదాయానుసారంగా ఆమెకు పెళ్లిమాపులు జరుగుతాయి. సంబంధం కాలమాన పరిస్థితులనుబట్టి మంచిదే అని చెప్పుకోవచ్చును. శాంతకు తాతగారి అండదండ లున్నాయి. ఆయనకు శాంత అంటె ప్రేమాభిమానాలు మెండు ఆ కారణంగానే శాంత పెండ్లి ఘనంగా జరిగింది.

పన్నెండేండ్లు నిండని శాంత అత్తవారింటికి కాపురానికి వచ్చింది. కాలాన్ని బట్టి వెయ్యిన్నూట పదహార్లు కట్నము, లాంఛనాలు వగయిరాలతో పిల్ల రావటం కాల ఘనమైన పెండ్లి అని చెప్పుకోవచ్చు.

శాంత చందనపు బొమ్మలాంటి అందగత్తె. భర్త సుబ్బారావుకు ఆమె అంటే త్వరలోనే మంచి అభిమానము ఏర్పడింది.

అత్తరంపపుకోతకు శాంత దుఃఖపడుతూవుంటే గమనించిన సుబ్బారావు ఆమెను ఓదారుస్తూ తనపిన్ని మాటలు (సవతితల్లి) పట్టించుకోవద్దని సలహా యిస్తాడు. శాంత అత్త స్వయాన అత్త కాదు. సుబ్బారావు మారుటితల్లి.

సుబ్బారావు మారుటితల్లి పిల్లలు చంద్రం, కమలలు. శాంతవయస్సు ఏపాటిది? పిల్లలలో పిల్లగా వారితో కలిసిపోతుంది.

చిన్నవయస్సే అయినా, వంటవార్పులలో మంచి నేర్పరిగా రూపొందింది శాంత. సుబ్బారావు సంసారంలో సులువుగా శాంత యిమిడిపోయింది, అది శాంతకు సహజం అనిపిస్తుంది పాఠకునికి. కాలప్రవాహం ఆగదు గదా? శాంత తాత శాస్త్రిగారు, సుబ్బారావు తండ్రి గోపన్నగారు ఇరువురు వారివారి కాలం తీరి మరణిస్తారు. శాంత అత్త మంగమ్మ తనస్థితిలో వచ్చిన మార్పును గ్రహించి అతిదీనంగా విలపిస్తుంది. సుబ్బారావు శాంతలు ఎంత ఊరడించినా లాభము ఉండదు. కొద్ది రోజులకు ఆమెకూడా మరణిస్తుంది. జీవనయాత్రలో వీరి ముగ్గురి మరణాలు సహజమే అనిపిస్తాయి.

శాంత లేత భుజాలమీద మంగమ్మ పిల్లలభారం పడుతుంది. అయినా ఆమె తొణకదు. బెణకదు. 'ఇది మాయిల్లు, మిమ్మల్ని ఎక్కడికీ పంపనమ్మా. కష్టమో, సుఖమో అందరము ఒకచోటే ఉందాము.' అని ఏడుస్తున్న పిల్లలను ఓదార్చి హామీ యిస్తుంది.

ఇక్కడ ఒక సంగతి ఉల్లేఖించక తప్పదు. శాంతకు ఓర్పు ఎక్కువ. పనికి జంకదు. తన కున్నది ఇతరులకు ఇంత పెట్టి తను తరువాత తినేస్వభావం. క్షమాగుణం ఆమెకు పుట్టుకతోనే వచ్చింది. పూజలు పురస్కారాలు ఎక్కువగా అలవడకపోయినా దైవంలో నమ్మక మున్న వ్యక్తిగా రచయిత్రి మలిచారు. తత్ఫలితంగానే శాంత మూడవ సంతానమునకు గ్రామదేవత పేరు 'సరోజ' అని పెట్టడం జరుగుతుంది.

కాలము గడచిపోతోంది. శాంత సంసారము పెరుగుతూంది. ముగ్గురుకొడుకులు ఒకకుమార్తె. సంసారం గడుపుకుంటూ సుబ్బారావు తమ్ముడు చంద్రానికి డాక్టరీ చదవడానికి డబ్బుపంపడానికి కుట్టుమిషన్ను చేపడుతుంది. చంద్రం శాంతశ్రమతో డాక్టరుఅవుతాడు. శాంత పాత్రలో రచయిత్రి త్యాగం, కార్యదీక్ష అచ్చుపోశారు. 'ఆశాంతమూర్తి సాన్నిధ్యంలో పదిరోజులుంటే ఏరోగాలయినా దూరం పోతాయేమో' అంటాడు రోగాలను నయంచేసే తానే డాక్టర్ చంద్రం.

చంద్రం మేనమామ తనకూతురైన లీలను చంద్రానికి పెండ్లిచేసి చంద్రాన్ని సుబ్బారావు కుటుంబానికి అవసరానికి రాకుండా చేసేస్తాడు. అయినా సుబ్బారావు శాంతలు చంద్రాన్ని తప్పుపట్టరు. ఇది వారి వుదాత్తతను చాటిచెబుతుంది.

సుబ్బారావు పెద్దకొడుకు శ్రీధర్ పట్నంలో చదువుకు వెళ్లి చంద్రం యింట్లోవుండి గడుపుకోగా లని సుబ్బారావు శాంతలు ఆశపడతారు, ఆ ఆశ

నిరాశే అవుతుంది. చంద్రం భార్యలీల, తల్లి, తండ్రి అందరూకలిసి శ్రీధర్ పరిస్థితి దుర్భరముగా తయారుచేసి నోటితో చెప్పకుండా శ్రీధర్‌ను వారింటినుండి సాగనంపుతారు. అయినా శాంత సుబ్బారావులు చంద్రంను ఏమీ అనరు.

శ్రీధర్ చదువు పట్నంలో ఒక ఉదారహృదయు డయిన రాంరెడ్డిగారి సహకారంతో కొనసాగుతుంది.

ఇక్కడనుండి కథ ఒక క్రొత్త మలుపు తిరుగుతుంది. శాంత సుబ్బారావుల కుటుంబమును అర్థంచేసుకొని దయతో చూచే రెడ్డిగారి కుటుంబము వీరికి చాలాసన్నిహితమవుతుంది. ఇచ్చటి నుండి రచయిత్రి విప్లవాత్మక మైన ధోరణులతో కథను ముందుకు నడుపుతారు. రాంరెడ్డిగారి కుటుంబములో సుబ్బారావు కుటుంబమునకు వైవాహిక సంబంధములు ఏర్పడుతాయి. అంటే రెడ్డిల కుటుంబము, బ్రాహ్మణుల కుటుంబము ఏకమయ్యాయి. రెడ్డిగారి కుమార్తె విజయ శ్రీధర్‌ను వివాహమాడింది. సుబ్బారావు కుమార్తె - శ్రీధర్ చెల్లెలు అయిన సరోజ రెడ్డిగారి కుమారుడు ప్రభాకర్‌ను వివాహమాడింది.

వివాహాలు నిరాడంబరంగా రిజిస్ట్రారు ఆఫీసులో జరుగుతాయి. నాయుడు కుటుంబములోని అమ్మాయి భారతిని రెడ్డిగారి పెద్దకొడుకు సుధాకర్ చేసుకుంటాడు. కథలో ఒడుదొడుకులు ఉండవు. శ్రీధర్ కొంతకాలము ఉద్యోగం చేసి తదుపరి రెడ్డిగారి కుటుంబంసలహామీదట వ్యాపారము మొదలు పెడతాడు. కలిసివస్తుంది. ధనవంతుడవుతాడు.

శాంతసుబ్బారావుల కుమార్తె సరోజ ప్రభాకర్‌కు అనుకూలవతియైన భార్యయై కుటుంబమునకు ఎంతో నిండుతనాన్ని తెస్తుంది.

శాంత రెండవకుమారుడు గిరిధర్ పాత్ర గాలికి కొట్టుకొనిపోయే సోమరి జీవితము. అతడు ఏమంచి పనినిగురించీ ఎన్నడూ ఆలోచించడు. చెడుపనులు చేయుటకు అసలే వెరవడు.

ఇతడొక తుమ్మముల్లులాగ శాంతహృదయమునునిత్యముగా కుపరుస్తూఉంటాడు. ఇతనికి చదువుపై శ్రద్ధలేదు. పనిచేసుకునైనా గౌరవముగా బ్రతకాలని ఆకాంక్షలేదు. ఇటువంటివానికొరకు తల్లి హృదయము ఆక్రోశిస్తుంది. ఇతనికి నలుగురి ఆలోచనలూ పట్టవు, తన తిరుగళ్ళను ఎవరేనా అభిశంసిస్తే, నడత సరిచేసుకోవాలనే ఇంగితజ్ఞానము అసలే లేదు.

దొంగతనం చేయటానికి జంకడు. శ్రీధర్ ఉద్యోగసంపాదనను తల్లిదండ్రులకు పంపిస్తే అడబ్బుతో ఇంటినుండి పరారీ అవుతాడు గిరిధర్. శాంతసుబ్బారావుల మనోవేదన ఇతనికి గోచరమే కాదు. నేటికాలము యువకులలో చాలామంది ఇదే తరహా వా రున్నారు. వారికి ప్రతినిధి ఈగిరిధర్ ప్రబుద్ధుడు.

చేతికి అందినది పుచ్చుకొని, ఇంట్లో నుంచి పలాయనముచేసి ఏదోసాధిస్తానని అనుకొని ఆత్మవంచన చేసుకుంటాడు. క్రూరమయిన నేటి సామాజిక పరిస్థితులలో మనిషి ఒక ఉపయోగకరమైన పనిలో కుదురుట నాల్గురాళ్ళు సంపాదించుట తనకు తాను గౌరవప్రదముగా బ్రతుకుట అంత సులభమా ?

శ్రీమతి సులోచనగారు సామాజికపరిస్థితులు, యువకుల దుందుడుకు ప్రవర్తనలు అద్దముపట్టినట్లు గిరిధరుని పాత్రలో, చిత్రించారు. 'పెండ్లిచేసినయెడల సర్దుకుంటారు ఇటువంటివారు' అనే అభిప్రాయము కుటుంబములలోని పెద్దవారు తఋచు అనుకోవడము వింటుంటాము.

ఈపెండ్లిండ్లు, వియ్యాలు సమస్యలను యింకా చిక్కుబరుచుటకు ఉపయోగపడతాయి అంతే. సరిగ్గా అదే జరిగింది గిరిధర్ విషయములో. గిరిధర్ కుదురుపడతా డని వివాహం చేస్తారు. అతని భార్య శాంతకుటుంబములో ఇముడలేకపోతుంది.

ఈకుటుంబము యొక్క ప్రగతిప్రమాణమును అనాచారము, దురాచారము వల భ్రష్టత్వముగా గిరిధర్ భార్య లక్ష్మి తలపోస్తుంది. నేటికాలములో ఆచరించిన నగుబాటుగా కన్నులకు కొట్టవచ్చినట్లు కనిపించే చాదస్తపు ఆచారములను తన జీవితములో ప్రవేశపెట్టుకుని చూపరులకు ఎబ్బెట్టుగా తయారయి శాంత సుబ్బారావులకు, శ్రీధర విజయలకు, సరోజ ప్రభాకర్‌లకు అందరికి నరకముగా తయారవుతుంది. వ్యక్తిత్వములేని గిరిధర్ ఈ పరిస్థితులలో దారి, తెన్ను కానక, చివరిసారి ఇంటినుండి పలాయనం చిత్తగిస్తాడు. ఇది గిరిధర్‌కు తోచిన పరిష్కారము.

శాంతమనస్సు పూర్తిగా వికలమవుతుంది. సత్ప్రవర్తన, ఓరిమి, బంధువుల, సానుభూతి, ఎందుకు గిరిధర్‌ను ఒక మనిషిగా చేయలేకపోయాయి. ప్రస్తుతం మనసమాజపరిధులలో యువకుల, యీరకమైన, వింతయైన, విషాదకరమైన ప్రవర్తనకు పరిష్కారంలేదా అనే వేదన పాఠకుని మనస్సును కదలించి వేస్తుంది.

లక్ష్మి తల్లిదండ్రులు వచ్చి శాంత సుబ్బారావులపై విరుచుకుపడతారు. ఈ విధమైన అభాండము భరించలేక తను కున్నదంతా లక్ష్మి పేర వ్రాసివేసి తీర్థయాత్రలు చేస్తూ దైవసన్నిధిలో మనశ్శాంతి సంపాదించుకుంటారు. చివరకు వెంకటేశ్వరుని సన్నిధిలో బంధువు లందరి మధ్య శాంత తనువు చాలిస్తుంది.

ఈ త్యాగమయి జీవితమును రచయిత్రి ఎంతో పటిష్ఠముగా చిత్రీకరించారని వ్రాయక తప్పదు. గిరిధర్‌ను మినహాయించి శాంత సంతానములోని ముగ్గురు, రాంరెడ్డిగారి కుటుంబములోని ముగ్గురు కలిసి, పైసంబంధాలపిల్లలను ఇద్దరను జోడించి ఈ ఎనమండుగురని పొందిగ్గా నాలుగు జంటలుగా చేసెరు రచయిత్రి. ఈ జంటల, ఆశయాలు, ప్రేమాభిమానాలు, వ్యక్తిత్వాలు ఒకటేమిటి అన్నీ ఒక ఉదాత్తమైన పరిధిలో చిత్రింపబడ్డాయి.

గిరిధర్‌ను మినహాయిస్తే యీ నవలలోని ముఖ్యమైన పాత్రలన్నీ స్వయంకృషికి ప్రతీకలు, తమ శ్రమతో తాము జీవితంలో ముందుకుసాగి అభివృద్ధి అయి యితరులకు మార్గదర్శకు అవుతారు.

శ్రీమతి సులోచన గారు సంఘసంస్కరణమును ధైర్యముగా చేపట్టి ప్రచారసాధనంగా యీ నవలా రచనను చేపట్టేరు.

'ఋణానుబంధరూపేణ పశు పత్ని సుతాలయాః' అన్నట్లు ఇదే సిద్ధాంతాన్ని 'ఏజన్మ పాపమో గాని వీడిరూపంలో వచ్చి పీడిస్తున్నది' అని శాంత కొడుకును గురించి బాధపడటం (పే. 94) గిరిధర్ ఒక్కడికే పరిమితం కాదు. అటువంటి గిరిధరులను నేటిసమాజంలో చాలామందిని చూస్తున్నాం.

ఈ నవలలోని శాంతను అందరూ ప్రశంసిస్తారు.

'ఒక్కనాడైనా నన్నువీడి ఉండని మీ అమ్మను ఈ గడ్డపై దాచి ఇంటికి ఎల్లాగానురా? నాయనా! – ఒక్కనాడు నాకు ఇది లేదు_అది కావాలి_అని బాధించలేదు. పుణ్యాత్మురాలు' ... అని విలపిస్తాడు శాంత భర్త సుబ్బారావు.

'ఈ శాంతమూర్తి సాన్నిధ్యంలో ఏ పదిరోజులో ఉంటే ఏ రోగాలైనా దూరమైపోతాయేమో' ... అని వదినగారైన శాంత ఒడిని తల్లి ఒడిగా మురిసిపోతాడు – శాంతమరిది చంద్రం.

'ఎంతవారైనా మీసాటి కాగలరా? మళ్ళీ జన్మఅంటూ వుంటే మీగర్భంలో పుట్టాలని భగవంతుణ్ణి వేడుకుంటాను' అంటుంది. – రెడ్డిగారికోడలు – సుధాకర్ భార్య అయిన 'సంధ్య'.

'మమ్మల్ని క్షమించక్కయ్యా! అహంకారంతో మిమ్మల్ని తూలనాడి కుటుంబాన్ని విడదీసి ఈరోజు దానిఫలిత మనుభవిస్తున్నాము.' అని బాధపడి తోడికోడలైన 'లీల' శాంతని ప్రశంసిస్తుంది.

'మొదటిభార్య చనిపోయి దుఃఖంలో కుమిలిపోతున్న సుధాకర్ దగ్గరికి వెళ్ళి తలనిమిరి – ఓదార్చి అన్నం ముద్దలుచేసి నోటి కందిస్తుంది. తల్లిని జ్ఞప్తికి తెచ్చే ఆమె ప్రేమ, అన్నింటిని మరపించే ఆలాలన సుధాకర్‌ని ఆకట్టుకున్నాయి. ప్రశంసిస్తాడు సుధాకర్.

'నాకుతోబుట్టువులు లేని కొరత తీరింది. అందుకే నిన్ను మన్నించాలని అనిపిస్తుంది. పరాయిగా చూడ బుద్ధవదు శాంతమ్మా అంటారు వియ్యంకుడు రామిరెడ్డి.

'ఆమె నీకు తల్లి కావచ్చు నాకు ఒక అమృతమూర్తి. దేవతామూర్తిగా మాకు పరిచయమైంది' ... అని శాంత మరణం పట్ల ఆవేదనని తెలియబరుస్తాడు – తిరుపతిలోని డాక్టరు.

ఈవిధంగా ఈ నవలలోని ప్రధాన పాత్ర 'శాంత' తదితరులందరి చేత ప్రశంసింపబడిన దగుటచేత 'జీవనయాత్ర' నవలకు 'శాంత' ఒక హైలైటు అని చెప్పవచ్చును.

—+—

# భక్తపోతన

శ్రీ ఏ. రామసూర్యనారాయణ
శ్రీ బి. వి. ఆర్. ప్రసాదమూర్తి.

* 'వ్యాస నగోద్భవంబయిన
భాగవతామృత సారధోరణుల్
వాసిగఁ దెల్గువాకిళుల
పై ప్రవహింపగఁ జేసి సంతత
శ్రీసఖపాదచింతన వ
శీకృత చిత్తుఁడవైన భావుకా
గ్రేసర! పోతనా! కవి భ
గీరథ! నీకు నమస్సుమాంజలుల్.'

* 'రామపదాబ్జమందు భ్రమ
రంబయి భక్తి విశిష్టతన్ పరం
ధామ కథాసుధారసముఁ
ద్రావి కలస్వన కంఠమెత్తి త
న్నామ పురస్సరంబుగ వి
నమ్రత భాగవతంబుఁ బాడి సం
క్షేమ పదంబుజేరి విల
సిల్లిన పోతన! నిన్ స్తుతించెదన్

* 'పంచమవేదమై పరగ
భారతమున్ రచియించి తృప్తినొ
క్కించుకఁ గానలేక రచి
యించెను భాగవతంబు వాసుదే
వాంచిత నామ సన్నుతి మ
హాత్ముఁడు వ్యాసుఁడు_ అట్టిదాని తా
నెంచుకొనెం దెనుంగున ర
చింపగ భక్తుఁడు పోతనాఖ్యుఁడున్.'

* లలిత రసాల పల్లవ వి
లక్షణమా కవనంబు తోడ గుం
డెలు కరగించి భారతికి
నెమ్మిఁ దలిర్పఁగ మాసిపోని సొ
మ్ముల నొడగూర్చి నట్టి మన
పోతన తెల్గున జన్మ మొందుటల్
తెలుఁగు పడంతి నోములు ఫ
లించుట గాదె తలఁచి చూడఁగాన్.'

* 'అకళంక స్థితి రమ్య భావగస శ
బ్దార్థంబులం జూడ వా
నికవే సాగుచుఁ బోయెనో సహజ పాం
డిత్యంబు నీకే గదా

ప్రకటంబాయెఁ గవి ప్రపంచమున, వి
 ద్వల్లోక నిర్ద్వంద్వ ని
త్యకళా నిర్మల సాహితీ విభవ సం
 ధానైక దివ్యాత్మకా!'

* 'వీని రసార్ద్ర భావనలు
 వీని కవిత్వ పటుత్వ తత్త్వముల్
వీని విశాల దృక్పథము
 వీని కళా పరమార్థముల్ 'న భూ
తోనభవిష్య' తంచు బు
 ధుల్ వచియించిరి రమ్యమాయె న
య్యా! నినుఁగన్న తల్లి కడు
 పంతయు మించి ఫలంబు లుండునే'

* 'అల ప్రహ్లాదుఁడు భక్తి భావ వశతన్
 హా! శ్రీహరీ యన్న, వి
హ్వల నాగేంద్రము నిస్సహాయగతి రా
 వా! యీశ్వరా! యన్న తా
పులలోఁ దావక దివ్యమానస గుణో
 ద్భూత ప్రభావాంచితో
జ్జ్వల భద్రాయిత పుణ్యరూపముచె సా
 క్షాత్కార మయ్యెం గవీ!'

* 'పరమ పతివ్రతామణి కృ
 పామతి తల్లియు నుగ్గుపాల భ
క్తిరసముఁ బోసి యుండునో సు
 ధీజన భాజనమౌ కవిత్వమం
దరయఁగ భక్తి తత్త్వము స
 మంచిత పాత్రల చిత్రణంబులన్
వరలఁగఁ జేసి చేంతి శు
 భస్థితి మోక్షము భక్త పోతనా!

* భూతల మందు సత్కవులు
 పుట్టిరి గిట్టిరి కాని విశ్వ కం
జాత నవార్కుఁడౌ హరి ల
 సత్కథలన్ వెలయించి మోక్షల
క్ష్మీకరశాక్షి కౌగిట సు
 ఖించి తరించిన నిన్నుఁ బోలు వి
ఖ్యాత కవీశ్వరుండు గలఁ
 డా కవితా జగమందు పోతనా!'

—+—

రాజమహేంద్రవరములో జరగిన

# జ్యోతిశ్శాస్త్ర సభా వ్యాసముల సమీక్షా పరామర్శము

— శ్రీ ఎం. వి. ఎస్. ప్రసాద్, బి. ఎస్‌సి.

16-12-80 తేదీగల 'సమాలోచన' పత్రికలో దుర్వ్యవా స్తవ్యులు శ్రీ ధూళిపాళ వెంకట సుబ్రహ్మణ్యసోమయాజులు గారు 'రాజమహేంద్రవరములో జరిగిన జ్యోతిశ్శాస్త్రసభా వ్యాసములసమీక్ష' యని విషయములను వ్రాసి వానిపై సంగ్రహముగా స్వాభిప్రాయమును వ్రాసినారు. (వారి అభిప్రాయము.)

'జ్యోతిశ్శాస్త్రసభలు జరిపే తీరున ఈ రాజమండ్రిలో నిర్వహించిన సభలు జరుపబడలేదు. కారణ మేమనగా :- అందరకు సమ్మతమైన అధ్యక్షుని ఎన్నిక జరుగలేదు. ఎజండాను ముందుగా పంపి వారి వారి అభిప్రాయములను సేకరించి వ్రాసిన సమాధానముల మీద విమర్శ జరగలేదు. ఆ వ్యాసములలో పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి ఆహ్వానము పంపలేదను విమర్శ పిడపర్తివారు చేసినట్లు కనపడలేదు. పిడపర్తివారు, శ్రీపాదవారు చాలరోజులనుండి జరుపుచున్న వాదప్రతివాదములే కాని ఈ వ్యాసములలో నవ్యత లేదు.

రాజమండ్రి సభవారు ఇదమిత్థమని తేల్చిన విషయమేమీ లేదు. వాస్తవములో కేతకరుడు జ్యోతిర్గణిత గ్రంథము తరువాత, మరాఠీగ్రహగణితము, కేతకీ గ్రహగణితము, మొదలగు అనేక గ్రంథములు రచించిరి. చైత్రపక్షమునండి, మరియొక పద్ధతి అనండి ప్రస్తుతం 23పైగల అయనాంశములు వచ్చేటట్లు గ్రంథములు రచించినారు. మరియొక పద్ధతి చూపలేదు. మరియు ఆమార్గమే మంచిదని అనేకమంది సుప్రసిద్ధ గణకులు గ్రహించియున్నారు.'

మరియు 'శ్రీ డాక్టరు మురారీలాల్ శర్మగారి' నిర్ణయః అనువ్యాసములో ఇట్లు గలదు.

'తత్ర...రవి రపి స్ఫుటఏవ గ్రాహ్యః' అని కలదు. ఇదిరామచంద్రపురం సభా తీర్మానముతో ఏకీభవించు చున్నట్లు స్పష్టము.

పైనివ్రాసిన వారి అభిప్రాయములో గల భావమును చూచినచో 23పైని గల అయనాంశలనే గ్రహించటము మంచిదని ఎవరు చెప్పెదరో అట్టివారినే అధ్యక్షునిగా ఎన్నుకొనుట జరిగినప్పుడు ఆ సభానిర్వాహకులు అందరకు సమ్మతమైన అధ్యక్షుని ఎన్నుకొనినట్లుగా గ్రహించవలసియుండును. శ్రీధూళిపాళ అర్క సోమయాజి గారు, శ్రీ పరిషత్తు వారు ప్రకటించిన పుస్తకములో 13 నుండి 16 పేజీ వరకు వ్రాసిన ఇంగ్లీషు వ్యాసములో చైత్రపక్షమును గురించి ఎట్లు ఖండించి వ్రాసియున్నారో శ్రీ సోమయాజులు గారు చూడలేదేమో.'

శ్రీఅర్క సోమయాజి గారు వ్రాసిన విషయం ఎట్లున్నదో చూడుడు.

'Ketkar said in so many words,

ఇచ్ఛేయు ర్యే న హాతుం సుదృఢ
పరిచయాత్ వర్తమానాం ప్రవృత్తిం ।
తేభ్యశ్చైత్రాఖ్య పక్షః ॥

(ie) 'Those who are not prepared to change abruptly when they got accustomed to have Makara Samkramana or about Jan 13 th or 14 th, they

may adopt the Chaitra Paksha.'

This means that 'Ketkar' had at the back of his mind the correctness of Raivata Paksha alone. In the light of this one could easily see that the authors of the Chaitra Paksha designed an Ayanamsa just to carry with them the generality the ignorant public, but not because that Ayanamsam is warranted by any authority. In other words this Chaitra Paksha Ayanamsam has been virtually cooked up and should be deemed therefore unauthorised.'

గ్రంథకర్తయగు కేత్కారుగారే ఎవరు దృక్సిద్ధము చేయుటకు ఇష్టపడరో పూర్వపు సంప్రదాయపద్ధతినిబట్టి (అనగా గ్రహలాఘవ, సూర్యసిద్ధాంతాది గ్రంథములను బట్టి) గణితం చేయుచున్నారో వారు చైత్రపక్షమును గ్రహించవలసిన దని వారికొరకు చైత్రపక్షాయనాంశలను తనగ్రంథమందు సంగ్రహించితి ననియు, దృక్సిద్ధమే చేయవలె ననీ నొక్కివక్కాణించి యుండిరి. ఈవిషయములను శ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రిగారు వారి వ్యాసములో గూడా తెలిపియే యున్నారు. ఈగ్రంథమును గురించి శ్రీ సోమయాజులుగారు ఒక్కముక్కైనా వ్రాయకుండా కేత్కారుగారు చాలా గ్రంథములు వ్రాసినారని వ్రాయడంలో ఔచిత్యం ఏమీ కనపడలేదు. పైవిషయం గురించి శ్రీ సోమయాజులు గారు ప్రస్తావించకుండా '23 చిల్లరఅయనాంశములను మార్గమే మంచి దని అనేక మంది సుప్రసిద్ధగణకులు గ్రహించి యున్నారు.' అని వ్రాసియున్నారు.

సూర్యసిద్ధాంతరీత్యా భాయార్కకరణాగ్రాయనాంశములు 23 పైని వస్తున్నందున వీటికి దరిదాపులో వచ్చేట్లుసాధించిన చైత్రాపక్షాయనాంశములు దృక్సిద్ధములు గావని తెలిసినను అనేకమంది అంధపరంపరగా చేయుచున్నారు. అది యేమంచిమార్గ మనుకొనుట వారి వారి పాండిత్యలోపమునకు తార్కాణము అని అనక తప్పదు. కేత్కారు గారు దృక్సిద్ధము కాదని చెప్పిన చైత్రపక్షమునే పట్టుకొని అవాస్తవమును లోకమునకు అందచేయుచున్న పంచాంగకర్తలు తాము దృక్సిద్ధముగ పంచాంగరచన చేయుచున్నామనుట లోకవంచనము. క్యాలండరు రిఫారము కమిటీ రిపోర్టులోగల అనేక విషయముల నానాడు సభలో శ్రీ మధురకృష్ణమూర్తి శాస్త్రిగారు చదివి వినిపించి కమిటీ ఏవిధంగా అన్యాయమైన మార్గాన్ని ప్రచారం చేయుటకు సిద్ధమైనదో చూపియున్నారు. దానిని కాదన్నవారు ఎవరును లేక పోయిరి

మురారీలాల్ శర్మగారి 'నిర్ణయః' అను వ్యాసములో (తత్ర...రవి రపి స్ఫుట ఏవ గ్రాహ్యః' అని కలదు. అని అంతవరకే శ్రీ సోమయాజులుగారు చూపిరి. దాని పైమాటలు వ్రాయలేదు.

ఆపైనిగూడ మురారీలాల్ శర్మగారిట్లువ్రాసినారు.

'అతోయం విషయో మహాన్ వివాదాస్పదః' అత్రత్య విదుషా మస్మిన్ విషయే మతభేదం విలోక్యాయం విషయో బృహన్ సమ్మేళనే నిర్ణీతో భవత్వితో వర్తమానే దృక్ప్రతీతిజనక గణితసాధిత గ్రహగణనా పద్ధత్యా నిర్మితం నిరయణ పంచాంగం స్వీకర్తవ్య మితిప్రాయః సర్వై రేవాంగీకృత మతో మన్యే నిర్ణాయకమండలం తదనురూప మేవ నిర్ణయం పశ్యతీతి శమ్' అని వ్రాసినారు.

అనగా శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారు చెప్పినవిషయము గొప్పవివాదాస్పదమైనది. ఇక్కడ సభలోనున్న పండితులలోగల మతభేదములను చూచి శ్రీ శాస్త్రిగారు చెప్పిన విషయము విస్తృత పండితుల సభలో నిర్ణయింపబడవలసి యున్నది కాని సామాన్య విషయము కాదు. ప్రకృతములో దృక్ప్రతీతిజనక గ్రహగణితములనే చేయవలయు నను విషయము సర్వులచేత నంగీకరింపబడి యున్నది. నిర్ణాయక మండలివారుగూడ తదనురూపమైన నిర్ణయమునే తీసుకొనగలరని తలంతును అని వారి నిర్ణయమును చెప్పియున్నారు.

శ్రీ శ్రీపాదవారి మతమును సంపూర్ణముగ సభాముఖమున విశదపరచి, స్పష్టరవిని గ్రహిస్తే వచ్చే దోషములను కూడ శ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రిగారు మురారీలాల్ శర్మగారికి వివరించియున్నారు. దాని నంతను దృష్టియందుంచుకొని, వారొక్కరే దీనిని నిర్ణయించుటకూడదనియో లేక వారికి శక్యముకాకయో బృహత్సంమేళనములో నిర్ణయింపబడవలె నని వ్రాసిరికాని, శ్రీపాదవారిది తప్పని వ్రాయలేదు.

ఇంతేకాకుండా, శ్రీ మురారీలాల్ శర్మగారిని సభాముఖములో శ్రీ రేమెళ్ళ సూర్యప్రకాశశాస్త్రిగారు శ్రీపాదవారి మతమును గురించి మీరు కాదనగలరా? కాదంటే తగిన కారణములను చూపితే శ్రీమధురకృష్ణమూర్తి శాస్త్రిగారు సమాధానము చెప్పగలమనుచున్నారు. చెప్పలేనపుడు, శాస్త్రవచనాలు చూపలేనప్పుడు,మావాదము వదలుకుంటామంటున్నారు అని అడిగితే వారి మతము సరియైనదే అనుకోండి కాని దానిని ఆచరించటము ఎవరుచేస్తారు? అని సమాధానం చెప్పియుండగ; అది సత్యమైనదే,

శాస్త్రీయమైనదే అయినప్పుడు మా జ్యోతిశ్శాస్త్రపండితులే దానిని గ్రహించి లోకమునకు చెప్పాలి అని శ్రీ సూర్యప్రకాశశాస్త్రిగారు చెప్పియున్నారు. సభలో జరిగిన అనేక విషయములు చైత్రపక్షము దృక్సిద్ధముకాదని ఋజువుపరచి యుండెను. అన్నింటికంటె ముఖ్యవిషయమేమనగా గ్రంథకర్తయగు శ్రీ కేత్కారుగారే చైత్రపక్షము దృక్సిద్ధముకాదని నొక్కివక్కాణించియున్నారు. ఇది మరవరాని సత్యము. తొలగించుటకు వీలులేని గ్రంథస్థవిషయము. సమగ్రమైనశాస్త్రచర్చ ఏసభలో జరిగినను, చైత్రపక్షము శాస్త్ర ప్రమాణములకు నిలువజాలదనుట నిర్వివాదాంశము. ఎంతిగొప్ప సంమేళనము జరిగినా అంతే. ప్రచారంచేసుకొనేవారు ఏమీ తెలియని ప్రజలకు చెప్పుకుపోతూ వుండడం పరిపాటి. ఇంతే. అసలువిషయాలు వేరుగా వుంటాయి - కనుక శ్రీ సోమయాజులుగారు పై విషయాలను పునరాలోచన చేసి న్యాయమును గుర్తించాలని మనవి చేయుచుంటిని. 23 పైన అయనాంశలు ఏరకంగా వచ్చినను సరే ఏమీ మైనాసరే ఫరవాలేదు. అంకె మాత్రం 23 చిల్లర రావాలనే భావముతో శాస్త్రచర్చ జరిగినంత కాలం ఈవివాదం ఇంతే.

— + —

* తిక్కన కేవలం కవిబ్రహ్మయే. శ్రీ చిన్నయ బ్రహ్మకవి కవిబ్రహ్మ సృష్టికర్తయైన బ్రహ్మకవి కూడను.

తిక్కన (కవిత) కంటె మీరు విశిష్ట్యాధిక్యాన్ని పొందాలని ఆకాంక్షించడంలో తప్పు లేదు.

# ముంతాజిమహలు నిర్మాణ శిల్పం

- శ్రీ పి. మాలకొండయ్య, ఎం. ఏ.

పరహృదయగత సుఖదుఃఖాత్మక భావాల్ని స్వయం వ్యక్తమయ్యేటట్లు ఆవిష్కరింపజేసే నేర్పు కవికి కావలసిన ప్రథమఅర్హత. మంచి కవిత్వాన్ని ఉత్పత్తి చెయ్యాలంటే కవికి ఆవేశమూ అనుభూతీ, తోడుకావాలి. ఆధునిక ఆంధ్రకవితానందనోద్యానంలో స్వచ్ఛందంగా ఎలుగెత్తి మధుర భావాల్ని దిగ్దిగంతరాళంలో ప్రతిధ్వనించేట్లు ఆలపించిన కవికోకిల జాషువా. తనజీవితము నుండి అనుభూతి, సమకాలీన పరిస్థితుల నుండి ఆవేశమూ జాషువాకు లభించాయి. వీటిని ఆధారంగా ఖండకావ్యాల్లో అఖండభావాలను వ్యక్తం చేసాడు జాషువా. ఆకారణంగా వెలవడ్డ ముంటాజ్ మహాలూ, గబ్బిలము, పిరదౌసి, కాందిశీకుడు శ్మశానవాటి మొదలైనవన్నీ జాతి మస్తిష్కంలో పునరాలోచనల్ని రేకెత్తించాయి. భావంలోనూ, భాషలోనూ, అభివ్యక్తిలోనూ, జాషువాకు సమప్రజ్ఞ వుంది.

తాజమహాలు యావద్భారత ఖ్యాతిని ప్రపంచవ్యాప్తం చేస్తే ముంతాజిమహాలు ఆంధ్రజాతికి కీర్తిదాయకమైంది. షాజహాను తాజిమహాలుని భార్యాస్మృతికి నిర్మింపజేస్తే జాషువా ముంటాజ్ మహల్ని మాత్స్రాజాన్ని కొంతైనా తీర్చుకోడానికి నిర్మించాడనిపిస్తూంది.

జాషువా కవిత్వంలో వుండే లక్షణాలన్నీ ఒక్క ముంటాజ్ మహల్లోనూ సాక్షాత్కరిస్తాయి. దీంట్లో షాజహాను ముంటాజ్‌ల దాంపత్యజీవితాన్ని అభివర్ణించాడు జాషువా. వీరి దాంపత్యంలో సంయోగ వియోగఘట్టాలున్నాయి. సంయోగ ఘట్టాల్లో తాత్త్వికచింతన వుంది. జాషువా కవిత్వంలో తెలుగు జాతీయత వుంది. అంతకన్నా మించిన తెలుగు నుడికారముంది. చక్కని ప్రకృతివర్ణన వుంది. మొత్తం అన్నీ కలిసి జీవితంలో యేదో ఒక ఘట్టంలో అవసరమైన తాత్త్వికచింతనను నేర్పుతాయి. జీవితాన్ని అన్ని కోణాల్లోనుంచీ సమగ్రంగా దర్శించడంవల్లే పైభావాలన్నీ ముంతాజ్ మహల్లో సామరస్యం పొందాయి.

ముంతాజ్ మహల్లో సంప్రదాయ పాఠకులకు కావలసిన శైలీ, ఛందస్సు, ఉన్నాయి. ఆధునికులకు అవసరమైన సంస్కరణ భావాలూ చోటుచేసుకున్నాయి.

ఇక ముంతాజ్ మహలులో ఇతివృత్తంవిషయానికొస్తే ముంతాజి షాజహానుల ప్రణయజీవిత కథనం చాల చిన్నదనిపిస్తూంది. దీనిలోనూ వారి సంయోగ దాంపత్య వృత్తాంతం చాల చిన్నది. వారి గాఢాశ్లేషములనుండి ఒక్క నిముసంకూడా జారిపోలేదు. వారికి ఆహ్లాదాన్నికూర్చని వెన్నెలతునకలేదు. వారి అనురాగవృద్ధికోసమే కోకిల పాడింది. వారి మధురజీవనం ద్రాక్షతీగకే తియ్యదనాన్నిచ్చింది. ఈవిధంగా వారి కూర్మి పెంపు వలచి వర్ణనచేసి సుప్రసిద్ధగనిన సుకవి' జాషువా.

పదముగ్గురు సంతానం కలిగినా ముంతాజి లావణ్యం తగ్గలేదు. దీనికి కారణం దుష్టచింతనలేని సత్యవంతుల ప్రాయం జారదంటాడు జాషువా. సంపదపై సంపద, లేమిపై లేమి, కలిగినట్లుగా నేపదునాల్గవగర్భం ధరించింది ముంతాజ్. ఒక అర్ధరాత్రి ముంతాజ్‌కు పీడకల వచ్చింది. సర్వేంద్రియాలు తలుక్కుపోయేంత శీతజ్వరం తగిలింది. తన [illegible] మాత్ర

హీనమైనట్లు తన భర్త సతీవియోగభారంతో యమునానది ఒడ్డున గొప్ప సమాధి నిర్మిస్తున్నట్లు ముంతాజ్ కు తోచింది. ఆమె జ్వరం తగ్గడంకోసం రాజు వజ్రాల్ని, మణుల్ని అల్లాకు కానుకలుగా ఇస్తానని మొక్కుతాడు. కాని ఆమెకు స్వస్థత కలగదు. ఈసందర్భంలో 'చండతరుడైన విధి లంచగొండి గాదు' అనే అర్థాంతరన్యాసాన్ని నిలిపి సమకాలీన లంచగొండితనాన్ని వ్యక్తం చేశాడు జాషువా.

ఇదే సందర్భంలో మొగలురాణి భర్తతో కొన్ని మాట లంటుంది. ఈమాటల్లో తాత్త్విక భావాలున్నాయి. శరీరమున్నంతకాలకు ఈ ప్రాణికి నెమ్మదిలేదు. కష్టసుఖాలు చెలికత్తెలు. ప్రపంచం మృత్యుదేవతాద్యూత వినోద రంగం. గొప్ప సంపదలన్నీ పాచికలు. మనుష్యులంతా ఆగిరిమోషలో జలధియానం చేసే బాటసారులు. తమ రేవుల్లో దిగిపోతారు. గొప్ప పరాక్రమవంతుల కపాలపాత్రల్లో సింహాలు నీళ్ళు త్రాగుతున్నాయి. వాళ్ల అస్థిపంజరాల్లో నివసిస్తూ సాలీళ్లు గూళ్లు అల్లుకొంటున్నాయి. జీవితకాలంలో విశాల విశ్వాన్ని పాలించినా చివరకు ఈ స్థితి తప్పదని గత చరిత్ర సాక్ష్యంపలుకుతుంది. ఈవిశ్వవార్ధిగర్భంలో పగలనక, రాత్రనక యెన్నో ప్రాణాలు లీనమౌతున్నాయి. ఈ మరణ వైరాగ్యమే స్మశానవాటిలోనూ వుంది. ఒకానొకనాడు ఆ కాళిదాసు భారవుల శరీరాల్లోని అణువులు మట్టిలో కలిసి కుమ్మరివాని సారెమీద ఇంకా తిరుగుతునే వున్నాయి అని అంటాడు. 'నాకోసం ఆకాశంలో దేవరథం వస్తున్నది సెలవిప్పింపు' మని చివరగా ముంతాజ్ భర్తను కోరింది.

ఇహలోకానికి సంబంధించిన కోరికలు, పనులు, సమస్యలు, బాధ్యతలు, ఇవన్నీ ఒక్కమరణంతోనే సమాప్తమౌతాయి. ఈవిధంగా ఆ ముంతాజ్ మహల్ రాణి కడకట్లన్యాయమైపోయిందని అంటాడు. ఇక్కడ షాజహాను ముంతాజ్ మరణాన్ని అన్యాయంగా భావించాడు. ఎందుకంటే తానుకట్టించిన మసీదుల్లో వుంటూ, తనకానుకలను గ్రహిస్తూ కూడా దైవం తనను అనుగ్రహించలేదు. ప్రపంచానికే వైరాగ్యం నేర్పించడానికి తనకు సతీవియోగం కలిగిందనుకుంటాడు రాజు. సంయోగ దాంపత్యంలో చూపిన అన్యోన్యత ఇంత వైరాగ్యాన్ని కలిగించి షాజహానును శాశ్వతంగా శోకమూర్తిని చేసింది. మానవుని అశక్తతను కవి షాజహాను పాత్ర ద్వారా యిక్కడ చెప్పాన్నాడు. షాజహాను శౌర్యసంపత్తి జాయారక్షణ చేయలేని అరణ్యజ్యోత్స్న. తాను చక్రవర్తి అయినా యిలాంటి ఘట్టాల్లో కేవలం మనిషే. మృతిఅనే ప్రవాహానికి అవతల ముంతాజ్ ఇవతలి వడ్డున షాజహాను వున్నారు. నిరాశా విషదవ్యామానమై సౌఖ్యపరాఙ్ముఖమైన తనజీవితశేషాన్ని అవివాహితుడుగానే భార్యకు అంకితం చేశాడు. అసుపేటికలో భర్తరహస్యాల్ని కాపాడే విశ్వసనీయమైన వ్యక్తి భార్య. అటువంటి భార్యమరణంతో షాజహాను ప్రబలసైన్య ముండీ భయపడుతున్నాడు. రాజ్యముండికూడా నిర్భాగ్యుడయ్యాడు. ఇక్కడ జాషువా ప్రణయజీవితంలో వుండే శక్తిని, మాధుర్యాన్నీ, వియోగంలో అశక్తతను, ఖేదాన్నీ, ఈ రెండు పాత్రల ద్వారా చూపాడు.

ఇదే సందర్భంలో షాజహాను
'ఆరిపోవని నీదుశరీరశోభ
దీపమైనది కాళింది తిన్నియలకు
మంజులంబైన నీ సౌకుమార్య మెల్ల
పంచుకొన్నవి తన్న దీపంకజములు'

అంటూ వాపోయాడు. కాళింది నల్లనిది. ఈనల్లదనాన్ని పోగొట్టే వెలుగు ముంతాజ్ శరీరశోభవల్ల వచ్చింది. ఆ నదీ పంకజాలలో వుండేలావణ్యం ఆమెసౌకుమార్యంనుండి లభించింది. అంటే ఆమె శరీరశోభ ప్రకృతివెలుగుతో కలిసిపోయింది. ఆమె సౌకుమార్యం ప్రకృతి లావణ్యంతో చేరిపోయింది. ఆమెప్రాణవాయువులు అనంతవాయువుల్లో విలీనమయ్యాయి. సృష్టిలోనుంచి ఉద్భవించిన మనిషి సృష్టిలో లీనమై ప్రకృతిలో తాదాత్మ్యంపొందుతాడనేసత్యం యిందులో నిరూపింపబడ్డది. అంతే కాకుండా షాజహాను అనుభవిస్తున్న విరహవేదనలో ప్రకృతివర్ణన వుంది. ఈ ప్రకృతి వర్ణనలో ఆ విరహక్లేశం దాగి వుంది. ఈ రెండింటిలో ప్రకృతితత్త్వం యిమిడి వుంది. ఈ అభివ్యక్తిలో వుండేబలం అంతా జాషువాకలంలోనే వుంది.

ఈవిధంగా పదిమూండొమ్మిది ఏడు లీడుగల దాంపత్యాన్ని దైవం ఆనాటితో అంటే ముంతాజ్ మరణంతో పెకల్చివేశాడు. ఈగాయాన్ని చక్కచేసే వైద్యుడులేడు. కారణం అది మనస్సుకు కలిగిన గాయం కావడం. కృతకమైన విశ్వసంపదను వదలిపెట్టి శేషితమైన తనజీవితరథాన్ని వైరాగ్య పథానికి మళ్ళించాడు.

'నిన్ను నుదరంబులో దాచుకొన్నమహికి
రత్నగర్భాఖ్య నేడు సార్థక్య మొందె
నీవు తలమీదదాల్చి మన్నించు కతన
వసుధ నొకబొగ్గు కోహినూరువజ్రమయ్యె'

అన్న ప్రాణుల్లాగానే ముంతాజ్ కూడా మట్టిలోనుంచే పుట్టి మట్టిలోనే కలిసింది. భూమికి రత్నగర్భ అనే పేరు ముంతాజ్ మట్టిలో కలవడంవల్ల సార్థకమైందట. సాధారణంగా లంభించే రత్నాలు వట్టి రత్నాలే. ప్రాణంలేనివి. కాని ముంతాజ్ జీవరత్నం. ఇక కోహినూరు వజ్రం ప్రపంచ ప్రసిద్ధిగన్నది. దాని కాప్రసిద్ధి రావడానికి కారణం దాన్ని ముంతాజ్ తలపై ధరించడం. ఇక్కడ కోహినూరు వజ్రాన్ని ప్రస్తావించడంలో భారతజాతీయత వుంది.

ఈవిధంగా వగచి ముంతాజ్ మృదు పదములు కందే కళిందజా తటిలో స్వర్గ ధామాన్ని నిర్మించడానికి రాజా ఢిల్లీ రాజ్యంలో ఒక పిల్లజమీందారు పదవి, అనేకరత్నాలు, గజారోహణము, పల్లకీ వూరేగింపులను బహుమానంగా ప్రకటించి అనేకమంది శిల్పులను రప్పిస్తాడు. తుదకొక మహాదరిద్రుడు భార్యాదుఃఖంలో కుందుచున్న వాణ్ణి అతని శిల్పశాస్త్రజ్ఞతకు, నైపుణ్యమునకు మెచ్చి అతణ్ణి శిల్పాచార్యునిగా నిర్ణయిస్తాడు. చలువరాళ్ళన్నీ కవివరేణ్యుని కలంలో తలలువంచే శబ్దాలవిధంగా మెత్తదనాన్ని పొందాయి. తాకితే కందిపోతుందన్నట్లు తాజ్ మహాలు నిర్మాణం జరిగింది. ఏబది ఆరుఅక్షరాలుండే కలికి భాషైన తెలుగుకే అలవిగాని తాజిలావణ్యాన్ని అభివర్ణించడం ఇతర భాషలకు వీలుకాదంటాడు జాషువా.

'కలదే స్వర్గము లాతిచో కలుగ నిక్కం బిద్దియే నీతిమం, తుల విశ్రాంతి నికేతనంబు' లాంటి ప్రస్తుతులకు నోచుకుంది తాజమహాలు. శిల్పులు తాజమహాలును నిర్మించడంలో ఎంత ప్రతిభ చూపించారంటే ఆఖరి సుత్తిదెబ్బతో వాళ్ళ శిల్పనిర్మాణ చాతుర్యం వట్టిపోయిందట. కాబట్టే తాజమహాలు ప్రపంచ వింతల్లో ఒకటైంది. దీనినిర్మాణంతోటే మొగలుపాదుషాలకీర్తి మొదటి ముగ్గు తొడిగింది.

కుమారుడు ఔరంగజేబు అన్నలను చంపి షాజహాన్ను బంధిస్తాడు. 'చక్రవర్తికి తనయుండె శత్రువయ్యె, విధి విరోధింప జరుగని వింత కలదె?' అంటాడు కవి. తండ్రిభోగి, తనయుడు విరాగి.

'గుడి గుడి సేవింపడు పా
ల్పడడుమజా సేయుమత్తువస్తువులకు న
య్యొడయడు పరికింపడు పెర
పడంతుకల నెరపు నేకపత్నీ
వ్రతమున్.'

ముంతాజ్ మహల్లో ఈపద్యం రెండు సందర్భాల్లో కనబడతుంది. మొదటిది షాజహానును, రెండవది ఔరంగజేబును గూర్చి చెప్పినపుడు. ఈ గుణాలు తండ్రికొడుకుల కిద్దరికి సమానాలే. తండ్రి ఆత్మే పుత్రాకృతిగా ఏర్పడుతుంది.

చెఱసాలలో ఏడుసంవత్సరాలు గడపి షాజహాను తనిప్రేయసిని చూడడానికి దివికేగాడు. 'నీవువసించు చోట వసియింతును నేనును దాచియుంపుమో, దేవి యొకింత నేల' అని పూర్వం షాజహాను కోరుకొన్నట్లు గానే అతనిశరీరం ముంతాజ్ గోరీప్రక్కనే సమాధి చేయబడింది. ఈవిధంగా 'ఇరువురు నొక్కచోట శయనించిరి.

'రాణి విడచిపోయె రాజు నొంటరిఁ జేసి
రాజువిడచిపోయె రాజ్యరమను
రాజ్యరమయువిడిచె రాజులఁ బెక్కండ్ర
తాజి విడువలేదు రాజసంబు.'

రాజునుఒంటరిగా వదిలేసి రాణివెళ్ళిపోయింది. అలాగే కొంతకాలానికి రాజు రాజ్యలక్ష్మిని వదలిపోయాడు. రాజ్యం కూడా ఎంతోమంది రాజులను వదలివేసింది. కాని తాజ్ మహాలుమాత్రం రాజసాన్ని వదల్లేదు. కావ్యరచనా ప్రణాళికంతా ఈపద్యంలో ఉపసంహరింపబడింది. ఈ జీవన్మరణ వ్యాపారం ప్రకృతి స్వభావం. తాజమహాలు రాజసాన్ని వదల్లేదు. ముంతాజ్ మహాలు పాఠకసహృదయాల్నీ వీడలేదు. 'తాజ్ మహాలు నిర్మాణంలో ఉన్నంత శిల్పనైపుణ్యం' ముంతాజ్ మహాలులోనువుంది. రసస్ఫూర్తి కలిగించే ఈకావ్యాన్ని వ్రాసిన జాషువా 'కవిని కన్నతల్లి గర్భంబుధన్యంబు'

'చదువవచ్చు గ్రంథసముదాయమంతయు
కృతులలోని నెరసు లేరవచ్చు
రసముసృష్టిచేయు ప్రజ్ఞా విశేషంబు
సాధనమున రాదు చదువు కాదు.'

(ముంతాజ్ మహాలు)

—+—

# సాహిత్య సమాలోచన సభలు - ఒక సమీక్ష

రాజమండ్రి గౌతమీగ్రంథాలయం ఆధ్వర్యంలోజరగిన ఈసభలకు సాహితీసమితి వారు ఆహ్వానములు పంపిరి. ప్రతిదినము రమారమి ఒకగంటఆలస్యముగా 7గంటలకు సభాప్రారంభము కాజొచ్చినది. అధ్యక్షుల, సభాప్రారంభకుల(ఒకొక్కరోజున ఇద్దరేసి ప్రారంభకులు) ముఖ్యఅతిథుల దీర్ఘప్రసంగముల తర్వాత ఒకరిద్దరు కవిగారి గ్రంథములపై సమాలోచన చేయడం జరిగింది. గ్రంథసమాలోచన సందర్భమున మాటిమాటికి పుస్తకం చూచి పద్యాలు చదవడంవల్ల ఒకవిధమైన పౌరాణిక వాతావరణం సభలో దృశ్యమానం అయింది. సభలో సాహిత్య సాహిత్యేతర పురప్రముఖులు పండితులు అధికారులు కవులు నటులు అనేకులు పాల్గొని చిన్నయబ్రహ్మకవిగారి కావ్యాలనీ ఆ ఆయన వ్యక్తిత్వ యోగ్యతలనీ మిక్కిలి ప్రశంసించారు.

ఏడురోజుల దీర్ఘకార్యక్రమం కనుక వక్తల గ్రంథసమాలోచన కంటె ఇతరుల ప్రసంగాలు అధికస్థానం ఆక్రమించినవని చెప్పవచ్చును. సభానంతరము చివరిరోజున కవిగారు గ్రంథసమాలోచకులకు ఇతరులకు కృతజ్ఞతలు తెలుపు

కున్నారు. సభాకార్యక్రమంలో అవసరార్థం అలతి అలతి మార్పులు చేయబడుతూ వచ్చినవి.

ప్రముఖుల ప్రసంగములలోని కొన్ని సుభాషితము లీ క్రింద పొందుపఱుపబడుచున్నవి.

ఒకటి రెండు కావ్యాలు వ్రాయడం ఘనత కాదు. చిన్మయబ్రహ్మకవిగారు 17 కావ్యాలు వ్రాసియున్నారు. అనువాదం వ్రాయడం కవిత్వం కాదు. వీరు స్వతంత్ర కావ్యములు రచించారు.

చరిత్రాంశములలో మార్పులు చేసిన వీరు భారతకథాంశంలో (శాకుంతలంలో) మార్పులు గావించిన కాళిదాస తుల్యులు.

చిన్మయబ్రహ్మకవి వర్ణితుడైన వేమన బుద్ధసదృశుడు.

శ్రీ ఎం. ఆర్. అప్పారావుగారిచే గండపెండేరం తొడిగించుకొనే అదృష్టం ఈ కవిగారికి పట్టింది. అది ఆయన స్వయం కృషిఫలితం.

సామాన్యజనులందరికీ అర్థమయ్యేదే నిజమైన కవిత్వం. చిన్మయబ్రహ్మకవి గారిది అట్టి నిజమైన ప్రజాకవిత్వం

S.S.C. Text బుక్కులో వీరి పద్యములు స్వీకరింపబడుటయే వీరు మహాకవి యనుటకు నిదర్శనం. (రాజమండ్రి మహాకవిగా ద్వితీయులా అద్వితీయులా?) నాదబ్రహ్మ పదార్థం వీరు పుస్తకం పంపేదాకా తెలియలేదు. నేను తెలుగేమీ చదువుకోలేదు. గ్రంథకర్త అభిమానం కారణంగా ఈ కార్యక్రమాని కంగీకరించాను. నిన్నరాత్రి గ్రంథకర్త గ్రంథం ఈయగా రాత్రికి రాత్రి చదివి యిచ్చట ప్రసంగిస్తున్నాను.

ఈయన కందపద్యరచన ధారాళంగా సాగలేదు. కుంటినడక నడిచింది. (కందేతర రచన ధారాళంగా సాగితే మెచ్చుకోవచ్చును గదా) చారిత్రాంశాల విషయంలో క్రమబద్ధత ఉంటే బాగుండేది.

ఈయన నన్నయ తిక్కన పోతనాది కవులకోవకు చెందినవారు. నేటి రాజమండ్రి కవిత్రయంలో ఒకరు. (మిగిలిన ద్వయం ఎవరో?) కావ్యాలు వ్రాసి గుణదోష విమర్శ చేయగలవారు చేయుండని ఛాలెంజి చేసినారు. (గ్రంథకర్తగారు స్వయంగా పుస్తకాలందించిన వక్తలను మాత్రమే ఛాలెంజి చేసియుందురా?) చిన్మయబ్రహ్మకవిగారి సౌజన్యం అలా ఛాలెంజి చేసేరీతిది కాదు. ఒకవేళ చేసియున్నా వక్తలెవరూ గుణప్రశంసే కాని దోషపరామర్శ స్పృశించక పోవడం వారి సౌజన్యాన్ని చాటుచున్నది.

తమ తెలుగువారిని గౌరవించడం కంటె అగౌరవించి కించపఱచడం ఆంధ్రుల దురభ్యాసం. (ఇంతమంది పెద్దలు ఇన్ని విధాల ప్రశంసించి గౌరవిస్తూంటే ఇన్ని బిరుదులు గండపెండేరాదులు ఇచ్చి గౌరవిస్తూంటే ఆంధ్రుల అవగుణం ఎక్కడ కనబడింది చెప్మా!)

భక్తికావ్యాన్ని శృంగారంతో ఆరంభించారు. చుంబనం ఎంతో మధురంగా వర్ణించారీ కవిగారు. అసలు చుంబనమే మధురంగదా. రసహృదయులకే కాని ఇట్టి వర్ణ చేయడం సాధ్యం కాదు.

ఈవిధంగా సప్తదినములు సాగిన సాహిత్య సమాలోచన ఒక ప్రత్యేకత, విశిష్టత సంపాదించుకొన్నది. అనుటలో సందేహం లేదు. శ్రీ చిన్మయ బ్రహ్మకవి గారిని ఘనంగా సత్కరించి మఱొక గొప్ప బిరుదాని సమర్పించివుంటే సభలకి ఇంకా నిండుతనం చేకూరి వుండేది.

శ్రీ వి. యస్. నారాయణ.

—+—

# ఈ పక్షంలో

## సాహితీ సమాలోచన సభలు

రాజమండ్రి శ్రీ గౌతమీ గ్రంథాలయంలో ఇటీవల వారంరోజులు ఈ సాహితీ సమాలోచన సభలు చాలా వైభవంగా జరిగాయి.

9 వ తేదీని సభకు శ్రీ నాళ్ళ కేదారేశ్వరుడు స్వాగతం చెప్పగా అధ్యక్షత వహించిన 'కళాప్రపూర్ణ' శ్రీ పసల సూర్యచంద్రరావు శ్రీ చిన్మయబ్రహ్మకవి ప్రజ్ఞ - సంస్కారం - పాండిత్యం - దైవభక్తి, గల ఉత్తమకవి అనీ, ఆయన రచనలపై సమాలోచన జరగడం - ఇటుపైని విశ్వవిద్యాలయాలు పరిశోధన జరపడానికి నాందీ ప్రస్తావన అనీ అభిభాషించారు సభను ప్రారంభిస్తూ శ్రీ తన్నీరు బుల్లెయ్య 'కవిగారు సంస్కృతాంధ్రాల్లో మంచి కవి పండితుడు. మీదు మిక్కిలి స్వయంకృషితో M. A. పట్టభద్రులు. ప్రస్తుతం వారు Ph D. ఇంటి దగ్గర నేవుండి చేస్తూన్న ప్రజ్ఞాశాలి. ఇటువంటి ప్రతిభావంతుణ్ణి ఇంతకు పూర్వమే ఆంధ్ర విశ్వవిద్యాలయం సత్కరించి వుండవలసింది' అని ప్రసంగించారు.

హృదయపరివర్తన కావ్యంపై శ్రీ కె. వి. రామకృష్ణారావు, సంధ్యాగౌతమిపై శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావు, విజయాంధ్రపై శ్రీ డా. శ్రీ ఎ. నారాయణరావు ఉపన్యసిస్తూ 'మధురకవితాధారా-పుష్కలపాండిత్యం-సమాజకళ్యాణాభిలాష-గల వీరి రచనలు సర్వథా ఆమోదయోగ్యాలు' అని వక్కాణించారు. శ్రీ బీరా బసవరాజు వక్తలను దుశ్శాలువలతో సత్కరించారు.

10వ తేదీని శ్రీ కంచుమర్తి శ్రీరాములు స్వాగతం పలుకగా శ్రీనార్ని కేదారేశ్వరుడు అధ్యక్షత వహిస్తూ, ఒకవైపు ఉపాధ్యాయవృత్తిని నిర్వహిస్తూ దైవాంకితంగా 17 కృతులను రచించి బహు సన్మానాల నందుకొన్న చిన్మయబ్రహ్మ కవి మహాకవి' అని ఉద్ఘాటించారు. శ్రీ సాధనాల నరసింహమూర్తి సభను ప్రారంభిస్తూ 'కవిగారు వినయశీలి, సౌజన్యమూర్తి, బహుభాషా కోవిదులు. వీరి రచనలపై పండితులు సమాలోచన జరపడం తెలుగుభారతికి ప్రతిష్ఠను నిలువబెట్టడమే అవుతుంది అని పలికారు. 'శివరంజని' కావ్యంపై శ్రీ పోతుకూచి గోపాలకృష్ణశాస్త్రి 'త్రివేణిపై' శ్రీ పడాల రామకృష్ణారెడ్డి మాట్లాడుతూ అనర్గళకవితాశక్తి - మృదు మధుర పద లాలిత్యం - ఆలంకారిక ప్రతిభ - సాంప్రదాయిక ప్రజ్ఞ, గల కవి పుంగవులు' అని వివరించారు. వక్తలను శ్రీ నార్ని కేదారేశ్వరుడు, శ్రీపి.వి.వి. రావు దుశ్శాలువలతో సత్కరించారు.

11 వ తేదీని శ్రీకారుమూరి మధుసూదన రావు స్వాగతం చెప్పగా శ్రీ మేడూరి సత్యనారాయణ సభకు అధ్యక్షత వహిస్తూ 'నిరాడంబరులు - దైవభక్తులు - సంఘ సేవాపరాయణులైన కవిగారి రచనలపై 7 రోజులపాటు సమాలోచన సభలు జరుపుతూన్న తెలుగు సాహిత్య సమితి వారు అభినందనీయులు' అన్నారు. శ్రీ చేబియ్యం వెంకట్రామయ్య సభను ప్రారంభిస్తూ 'స్వర్గీయ జటావల్లభుల పురుషోత్తం గురువుగారి కోరికపై వారు గతించినతర్వాత చక్కని కావ్యాన్ని రచించి వారికి అంకితం గావించి సాహిత్య అకాడామీ వారి పారితోషిక గౌరవాన్ని అందుకొన్న ధన్యజీవులు చిన్మయబ్రహ్మకవిగారు' అని ప్రసంగించారు.

శ్రీ కుసుమహార కల్పతరువు అను గ్రంథంపై శ్రీ చల్లా రామగణపతిశాస్త్రి, కుసుమహారగీత (ఆంగ్లాంధ్రానువాదం) పై శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తి, శ్రీ హరనాథ భాగవతం (గద్య కావ్యం) పై శ్రీ పి.జి. వేమారెడ్డి మాట్లాడుతూ 'కవిగారు శ్రీ హరనాథభక్తులని, వీరి రచనలు హరనాథ సారస్వతమున భక్తిమయ మణిదర్పణాలు అని శ్లాఘించారు. శ్రీ నడిపల్లి రామచంద్రరావు వక్తలని దుశ్శాలువలతో సత్కరించారు.

12వ తేదీని శ్రీ కంచుమర్తి శ్రీరాములు స్వాగతంచెప్పగా శ్రీ పోతుల వీరభద్రరావు అధ్యక్షత వహిస్తూ 'కవిగారి అపూర్వ కవితా శిల్పకదంబమే విశ్వదాభిరామ' మనీ, దానినుండి ఒక భాగం ప్రభుత్వం వారు S. S. C. తెలుగుపాఠ్యగ్రంథంలో ప్రచురించడం ముదావహ మని, 'బహు గ్రంథకర్తలైన వీరసేవ తెలుగుజాతి మరవరానిది' అని ఉపన్యసించారు. శ్రీ R V. చలపతి అతిథిగా పాల్గొని 'చిన్మయబ్రహ్మకవి నిరంతర సాహితీ కృషీవలులు, మంచి ఉపాధ్యాయు'లని ఉద్ఘాటించారు. డా. శ్రీ జె మృత్యుంజయరావు, శ్రీపి.బి. వీరాచార్యులు, ప్రభల సుబ్రహ్మణ్యశర్మ తెలుగునాట ప్రసిద్ధివహించిన వేమనపై కవిగారు రచించిన విశ్వదాభిరామం సర్వ సుగుణాలవాలం అని అభివర్ణించారు. శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యం వక్తలను దుశ్శాలువలతో సత్కరించారు.

13వ తేదీ శ్రీ నార్ని కేదారేశ్వరుడు స్వాగతం పలుకగా 'భాషా ప్రవీణ' 'వీణావిశారద' శ్రీమతి కోదూరి లీలావతీదేవి సభకు అధ్యక్షత వహిస్తూ సాహిత్య అకాడమీ గౌరవాన్ని అందుకొన్న రామానందకావ్యాన్ని చదివి ఆనందించాను. సాహిత్యపు విలువలను, సాంఘికాభ్యుదయాన్ని పరిరక్షిస్తూన్న వీరికావ్యం తెలుగునాట శాశ్వతంగా నిలువగల, దని అభిభాషించారు. శ్రీమతి T. బుచ్చిసుందరి సభను ప్రారంభిస్తూ 'నిరంతర సాహితీకృషిలో నిగ్గులుదేరిన కవిసత్తములు చిన్మయకవి - అని ఉద్ఘాటించారు. శ్రీమతి అమ్మన మహాలక్ష్మి కవిగారి కవితావైదుష్యాలు నిరుపమానములు - అద్వితీయములు అని అభివర్ణించారు. వక్తలను శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యం దుశ్శాలువలతో సత్కరించారు.

---

* ప్రతిపక్షాల సహకారం తప్పకుండా తీసికొంటాం. - ప్రభుత్వం.
* జైళ్ళలోఉంచి పోషిస్తూ కాదుగదా?

14వ తేదీని శ్రీ కంచుమర్తి శ్రీరాములు స్వాగతం పలుకగా శ్రీ పి. రామమూర్తి అధ్యక్షత వహిస్తూ 'సామాన్య కుటుంబంలో జన్మించి అసాధారణస్థితిని తనకు తాను ఆర్జించుకొన్న ప్రతిభాశాలి అయిన చిన్నయకవి తన కావ్యాన్ని సమీక్షింపు డని పండితుల్ని కోరడం లోనే వారిశక్తిసామర్థ్యాలు వ్యక్తమవుతూన్నాయి. ఇటువంటి వ్యక్తిని పెద్దలు-రసజ్ఞులు ప్రోత్సహించ వలసివుం దని హెచ్చరిందారు. శ్రీ దాసరి సుబ్బారావు సభను ప్రారంభిస్తూ 'మా ఛాంబరు శాశ్వతాస్థానకవు లైన చిన్నయ బ్రహ్మకవి రచనలన్నీ ఆంధ్రజాతి ప్రతిష్ఠకు అదృష్టదీపికలు అన్నారు. ముఖ్య అతిథి శ్రీ బి. పెదకాపు కవిగారి ప్రతిభావ్యుత్పత్తులు అమోఘములు. వారిసేవకు మా అండదండ లుండ గల వని అభిభాషించారు. శ్రీ S.T.P.V. కోనప్పాచార్యులు 'కవిబ్రహ్మ' కావ్యంపై ప్రసంగిస్తూ 'కవిబహ్మ తిక్కన వ్యక్తిత్వంపై రచించిన యీకావ్యం మనోజ్ఞ పదలాలిత్యం - ఋతువర్ణనం - సందేశం - ఉల్లాసం, ఔచిత్యంగల మనోహరకావ్య'మని శ్లాఘించారు. శ్రీ పతివాడ సూర్యనారాయణ, కారుమూరి వేంకటేశ్వరరావు నాద బ్రహ్మకావ్యంపై ఉపన్యసిస్తూ కవిగారు సంగీతసాహిత్యాభిజ్ఞు లని, త్యాగరాజు చరిత్రను అనర్ఘ మధురకావ్యంగా వెలయించిన కవిగారి రచనాకౌశలంవిన్నాణమైనది,సుందరమైన దని ప్రసంగించారు. శ్రీ పి. శ్రీరామమూర్తి వక్తలను దుశ్శాలువలతో సత్కరించారు.

15వ తేదీని శ్రీ పి.వి.వి. రావు స్వాగతం చెప్పగా శ్రీ విశ్వనాథ గోపాలకృష్ణశాస్త్రి అధ్యక్షతవహిస్తూ 'కవిగారు సంస్కృతాంధ్రాల్లో హిందీ ఆంగ్లభాషలలో పండితులేకాకుండ మంచి కవిశేఖరు లని వీరి రచనలు పండితైక వర్ణ్యములు - సరస కళాసముంచితము లని ప్రకటించారు. శ్రీ పి. సోమయాజులు సభను ప్రారంభిస్తూ '7 రోజులపాటు రాజమండ్రిలో మన కవిగారి రచనలపై సమీక్ష జరగడం ముదావహం అని ప్రశంసించారు. శ్రీమాన్ ముదుంబై నరసింహాచార్యులు మీరామనోహర కావ్యంపైని, ఆచార్య నాగార్జునుడుపై శ్రీచల్లా లక్ష్మీప్రసాదశాస్త్రి మాట్లాడుతూ కవిగారి ఆదర్శ జీవితం- నిరంతర కవితా వ్యాసంగం జాతికిరాచబాట లని రచనా వైవిధ్యంగల వీరి సాహిత్యము సముదార భావసంపన్నం' అని వివరించారు. శ్రీ చల్లా అప్పారావు ముఖ్యఅతిథిగా పాల్గొని కవిగారి సాహిత్యసేవ అపూర్వమైనదని అన్నారు. శ్రీ చిన్నయబ్రహ్మకవి మాట్లాడుతూ నారచనలను 7 రోజుల పాటు సమీక్ష చేసి గుణవిశేషాల్ని ప్రకటించిన పండితరసజ్ఞులు అభినందనీయులని ఈ మహాకార్యక్రమాన్ని చేపట్టిన తెలుగుసాహిత్య సమితి వారికి శ్రీ గౌతమీగ్రంథాలయ ప్రత్యేకాధికారి శ్రీ వి. యస్. దేవదాసు వారి సిబ్బందికి నాకృతజ్ఞతాభినందనములు సమర్పిస్తూన్నా నని అభిభాషించారు. శ్రీ నిమ్మలపూడి వీర్రాజు వందన సమర్పణ చేశారు. (చే. చి.)

—+—

## 2 మధురకవి శతజయంతి

జనవరి 21 తేదీని వైశ్యయువజన అసోసియేషను హాలులో మధురకవి శ్రీ నాళం కృష్ణారావుగారి శతజయంతి ఉత్సవసభ జరిగినది. నవభారతీ గురుకుల వ్యవస్థాపకులు శ్రీ తన్నీరు బుల్లెయ్యగారు సభకు అధ్యక్షత వహించిరి.

శ్రీమతి కోడూరి లీలావతి, శ్రీ డాక్టరు బి. యస్. ఆర్. ఆంజనేయులు, శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, శ్రీ దాసరి సుబ్బారావు, శ్రీనాళం కామేశ్వరరావు, శ్రీజి.సి.ఆర్.ఎన్. ఆచార్య, శ్రీ బాలనాగ శేషగిరిరావు, శ్రీ అష్టావధాని బులుసు వెంకటరామమూర్తిగారు శ్రీ కృష్ణారావుగారి సాహితీ సాంఘిక సేవను, గ్రంథాలయ సేవను ప్రశంసించి వారు మధురకవియేకాక మహాకవి యని వర్ణించిరి.

వారిరచనలన్నిటిని పునః ప్రచురణ గావించి శాశ్వతస్మారక చిహ్నం ఏర్పాటు చేయవలసిన ఆవశ్యకతను వివరించిరి. వారి జీవితము పరిశోధనాంశముగా గ్రహింపదగు ననిరి. శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యదంపతులు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, శ్రీనాళం కామేశ్వరరావు శ్రీమతి వనజాగుప్త, అష్టావధాని శ్రీవెంకటరామమూర్తి గార్లను శాలువాలతో సత్కరించిరి. శ్రీ ముత్తా వెంకట కామరాజు ఆద్యంతముల స్వాగతము వందన సమర్పణము గావించిరి.

—+—

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో గూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-8-7, ఇన్నిసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.